పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి

































# విషయానుక్రమణిక








శ్రీ హారమ్యం జడుగాగ; - సువ్రతుని
మాయింగా;-శుచిం దంభిగా;-
శూరున్ నిర్దయుగా; - మునిన్
విమతిగా; -శ్రోతప్రియాలాపు ని
స్సారుంగా; - బలవంతు గర్వితునిగా; -
సద్వక్త వాచాలుగా; -
క్రూరుం జేన్ని, సుధీగుణంబు
దురితారూఢంబు జేయుంగదా!

తా॥ సిగ్గుపడుతూ ఉండేవానిని చూచి వీడు చలాకీలేని మందమతివాడని అంటారు- తపస్సుచేసికొనేవానినిచూచి ఇతడు దొంగ జపం చేస్తూన్నాడని అంటారు - శుచిగా ఉన్నవానినిచూచి యితనికి దంభాచారం చాలా ఉన్నదంటారు - శూరుడైన వానిని చూచి నిర్దయుడంటారు - మునీశ్వరుని మతిలేని అలౌక్యుడంటారు - చెవి కింపుగా మాట్లాడేవానిని చూచి ఇతడు సరకులేని నిస్సారుడు అని అంటారు - బలవంతుడు కన్పిస్తే ఇతడు బడాయికోరు అంటారు - బాగా ప్రసంగించేవానిని చూచి యితడు వదరుబోతు అంటారు. గుణవంతుల లక్షణములను యీవిధంగా చెడ్డలక్షణములుగా చెడ్డవారు లెక్కిస్తూ ఉంటారు.

లోకం సత్యాసత్యములను సరిగ్గా నిదానంగా పరిశీలించదు. లోకం అవకతవకగా అవలోకిస్తుంది. అందుకనే లోకులు పలుగాకులు అని లోకులను నిందించడం సంభవించింది. అయితే, ఒక వ్యక్తిని సరిగ్గా అర్థం చేసికొనకుండా సులభంగా అతడు కపటి అనడంగాని, అతడు వట్టి చవట అనడంగాని సులభమైనపనికాదు. ఎందుచేతనంటే, అవ్యక్తి ఎదురుసవాలుచేసి వాదప్రతివాదాలకు దిగవచ్చు - చిట్టచివరకు మాటలు ముదిరి యిద్దరూ "త్వం శుంఠ" అంటే "త్వం శుంఠ" అని ఒకరిమీద ఇంకొకరు కారాలు మిరియాలు నూరవచ్చు. చివరకు "నోరు ముయ్" అంటే, "నోరు ముయ్" అని ఆక్రోశతిలో అరచి సమ్రతిలేక సామరస్యంలేక సివిలు వ్యవహారాన్ని క్రిమినలువ్యవహారంలోకి దింపవచ్చు. కాని, ఒకవ్యక్తి లోకాన్ని బాహాటంగా నిందించినప్పుడు, ఆ వ్యక్తిని తిరిగి దూషించడానికి లోకం ఏకమొత్తంగా తిరుగబడదు. లోకంతరఫున ఎవరో ఒకరిద్దరు ఆ నిందలు అన్నీ అందచందము లేని వ్యర్థాలాపములని జవాబు చెప్పవచ్చు. ఇంకో సందర్భం కూడా ఉంది. లోకమే ఏకమొత్తంగా నల్ల జెండాలు చేతబట్టుకొని, "మాకొద్దు యీ తెల్లదొరతనము" అన్నట్లుగా తెల్లవాళ్లను అందరినీ దూషిస్తూ, నిరసిస్తూ, ఒక దండయాత్ర సాగించవచ్చు. అది చాలా పెద్ద సంఘర్షణగా, 'అగస్టు' అల్లరులంత అట్టహాసంగా పరిణమించి ప్రజ్వలిస్తుంది. ఉభయ సంఘములకూ సమ్రతిలేకుండా వీణతీగెలు తెగినవన్నట్లుగా, టెలిగ్రాఫ్‌తీగెలు ముందుగా తెగిపోతాయి. వారికీ వీరికీ ఇక మాటలు ఉండవు. వారికీ వీరికీ యిక రాకపోకలు ఉండవు. ఎక్కడ రైళ్లు అక్కడ ఆగిపోతాయి. కాబట్టి ఒక సంఘాన్ని ఇంకో సంఘం నిందించడం సాగిస్తే సమరశంఖం ఊదినట్లే. నల్లజెండాలతో ఆరంభమైన నవకాళీ దురంతాలతో అంతమౌతుంది. ఒక జాతి యింకోజాతిని దూషించకుండా, ఒక వ్యక్తి యింకొక వ్యక్తిని దూషించకుండా, ఒకవ్యక్తి లోకాన్ని చూచి వెక్కిరించి హేళనచేయడంవల్ల, లోకంతో ఆ వ్యక్తికి వచ్చే తంటా తగాదా ఏమీ లేదు. అతడు లోకాన్ని ఏవిధంగా అనుమానిస్తాడో ఆఖరుకు అతడే తన్నుతాను అనుమానిస్తాడు. లోకం అంతా కపటవేషాలతో దొంగనాటకం ఆడుతోంది అని అనుక్షణమూ అనుమానించేవానికి ఆత్మశాంతి అంతకంతకు అడుగంటిపోతుంది. మానవజీవితంమీద నమ్మకం పోయిన సంశయాత్ముడు, ఎవరినీ నమ్మలేడు. వంకాయలు చవుకగా వీశె రెండణాలకు ఎవడైనా అమ్మివేస్తానని అన్నట్టయితే, ఆ కాయలన్నీ పుచ్చు వంకాయలుగాని, కవరు వంకాయలుగాని, అయివుంటాయనిన్నీ అందువల్లనే అంతచవుకగా అమ్ముతున్నాడనిన్నీ అనుమానిస్తాము. "ఈ హోటలులో తయారుచేసిన ఫలహారములన్నీ నేతితో తయారుచేయబడినవే" అని చెప్పినట్లయితే, ఈ కాలంలో నాలుగోక్లాసుపిల్లవాడుకూడా నమ్మడు. అందాకా ఎందుకు? గడచిన యుద్ధకాలంలో ప్రతి సాయం

కాలమూ ఆలిండియా రేడియోలో మిత్ర మండలివారి విజయాలను ప్రకటిస్తూ ఉండే వారు. "జర్మనీవారి నావలను ఈరోజున ఇరవై ముంచివేశార" ని ప్రకటించే వారు. ఆ లెక్కలనుబట్టి ముంచివేయబడిన శత్రునావలను కలిపి చేసిచూస్తే, జర్మనీ వారికి ఉన్నటువంటి నావలను ఒక్కొక్క దానిని రెండుసార్లు లేదామూడుసార్లు మిత్ర మండలి ముంచివేసినట్లుగా ఎంచవలసి వచ్చేది. అందువల్ల మిత్రమండలి (*Allies*) అంటే మిథ్యామండలి. (*All-lies*) (అన్నీ అబద్ధాలే) అని రేడియోలో విన్నవాళ్లు వెక్కిరించేవాళ్ళు. మిత్రవిజయం అంతా మిథ్యావిజయం అని హేళన చేశారు. కాని, మిత్రరాజ్యాలవారి వార్తలను నమ్మకపోయినందువల్ల చివరకు మిత్ర రాజ్యాలవారి విజయం నిజం కాలే దంటారా? మిత్రవిజయం మిథ్యావిజయం అన్నవారి మాటలే ఆఖరుకు అక్కరకురాని వెక్కిరింత అయింది.

ప్రపంచ వ్యవహారముల సత్యాసత్యముల వ్యత్యాసముల విషయములో తొందరపడి వెక్కిరించడంగాని, తూలనాడి, మేల మాడుటగాని మేలైన పనికాదు. మానవ హృదయాన్ని బోధపరచుకోనడం సులభ సాధ్యమైన పనికాదు. చింతామణివంటి వేశ్య వేషం మార్చి వేసింది. కాషాయ వస్త్రాలుధరించింది. కృష్ణభక్తిలో మునిగిపో యింది. ఆమెవిలువను రూపాయిలుఅణాలు పైసలలో లెక్కకట్టిన సుబ్బిశెట్టి కూడా ఆవిధంగా, ఆ రాగి విరాగి అవుతుందని అనుకోలేదు. ఇత్తడి బంగార మవుతుందని అనుకోలేదు. వాల్మీకి బోయవాడై కొండ లోయలలో మొండి బండ దొంగయై సంచ రించాడు. చిట్టచివరకు ఆ చిట్టడవిలోనే ఆ కొండలలోనే ఆ నిషాదునకు అద్భుత విషాదంవలెనే ఆత్మవిషాదం కలిగింది. ఒక నిషాదుడు క్రౌంచపక్షుల జంటలో ఒక పక్షినిమాత్రం బాణంవేసి చంపివేశాడు. ఆపక్షి చచ్చి క్రింద పడిపోయింది. రెండో పక్షి ఏడ్చింది. ఇదంతా వాల్మీకి చూచాడు. ఇక చూచుకోండి. నిషాదుడై తిరిగినవాల్మీకి హృదయానికి ఎలెక్ట్రిక్కు స్విచ్ నొక్కి నట్లయింది. ఆయనలోనుంచి విద్యుత్ శక్తి ప్రవహించినట్లుగా ఒక విద్యుత్ శక్తి రామా యణ కావ్యరూపంగా ప్రవహించి ప్రకా శించింది.

అందువల్లనే గాంధి మహాత్ముడు "*Faith!-Infinite Faith!*" (విశ్వాసం! అనంతమైనవిశ్వాసం!) ఉండాలిఅన్నాడు. "బ్రిటిష్‌వారు మనకు స్వరాజ్యం తప్ప కుండాఇస్తారు అనేనమ్మకం నాకుఉన్నది. బ్రిటిష్ హృదయంలో పరివర్తన ప్రకృతి సిద్ధంగా కలిగి తీరుతుంది అనే నమ్మకం - అనంతవిశ్వాసం నాకు ఉన్నది" అని గాంధీ మహాత్ముడు ఘంటాపథంగా చాటించాడు. అతులరాలా వ్రాసియిచ్చాడు.

తన భారతజాతియందుకూడా ఆయనకు అచంచలవిశ్వాసంఉంది. ఆయన బోధించిన అహింసామార్గమును సత్యమార్గమును సరిగ్గా అనుసరింపక, అక్రమంగా, అడ్డదిడ్డంగా యీ భారతజాతి ప్రవర్తించిది.

మహాత్మునియందు కూడా ప్రజలలో కొందరికి విశ్వాసం వికటించి అకటావిక టమై వికలమై శకలమై శిథిలమై పోతూ ఉన్నప్పటికీ, ప్రజలయందు ఆయనకు గల విశ్వాసం అచంచలమై ఆఖరుతుంవరకూ ఎవరెస్టుశిఖరంలాగున నిశ్చలంగా నిర్మలంగా ఉంది. మహాసంగ్రామ సంక్షోభకాలములో బ్రిటిష్‌వారిపక్షము మనము చేరకుండా, రష్యాపక్షమే మనము చేరవలెనని పండిత జవహరిలాల్ నెహ్రూ తన అభి ప్రాయం వెల్లడించాడు. కాని, బ్రిటిష్ వారిని ఈ చిక్కు సమయంలో నొక్కి మన వలలో చిక్కించుకొని, మన కోరిక దక్కించుకొనుటకు కూడా మహాత్ముని మనస్సు మెత్తపడలేదు. అది ద్రోహం అన్నాడు. మొదటి ప్రపంచసంగ్రామంలో బ్రిటిష్‌వారికి విజయం కలుగవలెనని కోర్కె యుద్ధపటాలములలో భారతీయ సైని కులను చేర్పించుటకు ఈమహాత్ముడే అహో రాత్రాలు ఊళ్లవెంటబడి గ్రామైకరాత్రంగా సంచరించాడు. ఈ సంచార ప్రయాసవల్ల ఆయనకు దేహారోగ్యం చెడి గ్రహణి వ్యాధి కూడా సంభవించింది చిట్టచివరకు బ్రిటిష్ వారికి జయం కలిగింది. మహాత్మునకు "కైజర్ హింద్" పతక బహుమతి లభించింది. అయితే నేం! ఆయనకే బ్రిటిష్‌వారు ద్రోహం చేసి, ఆయనమాట త్రోసివేసి, ఆయనను ఖైదులోకి త్రోసివేశారు. కాని, ఆ బ్రిటిష్ జాతియందు ఆయనకు గల నమ్మకం ఇస్త్రీ మడతవలె నలగకుండా చెదరకుండా నిలిచి ఉంది.

మానవహృదయం ఎంతలోతైనదో, ఎంత గంభీరమైనదో గంభీరహృదయులైన మహా త్ములకే బాహాటంగా బోధపడుతూ ఉంటుంది. ప్రజలలో యీరోజున ఉన్న భావాలు రేపుఇంకోరూపంలోకి మారు తాయి. అసత్యం మన ప్రవర్తనలో ఉండ వచ్చు. కాని, అసత్యం ఆత్మకు ఉండదు. తులసిమాలలు మెడలో వేసికొన్నవాడు వెల యాలికి వశుడై భోగంవీథిలో తిరుగవచ్చు. కాని, ఆ తులసిపూసలమీద తలపుకూడా అతనికిఉంది. బడాయికైనా భక్తుడైతేవాలు. ఆ వ్యక్తి హృదయంలో అభక్తికీ అబడాయికీ లడాయిజరుగుతూనే ఉంటుంది. "సత్యమేవ జయతే" అనేమాట సత్యమే అయినటయితే కల్లనూ కపటాన్నీ సత్యంజయించితీరవలెను. సరదాకోసం శాకాహారం సాత్వికాహారం

# రచయితలకు మనవి

మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫోటోలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైన స్టాంపు లను, రచనలూ, చిత్రాలూ ఫోటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాగితానికి ఒకే వైపున సిరాతో వ్రాసి పంపాలి.

ఫోటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించ బడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియజెయ్యడం కష్టం.

నిరాకరించబడిన వానిని త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచ గలము.

రచయితలూ, చిత్రకారులూ సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తు న్నాము.

—సంపాదకుడు.

# ★ కాలక్షేపం ★

తిన్నప్పటికీ, షోకుకోసం ఏకాదశీఉపవాసం ఉన్నప్పటికీ, సరదాగా మదనపల్లి ఆరోగ్యక్షేత్రానికి వెళ్ళినప్పటికీ, ఖులాసాకు గుల్కాందు తినినప్పటికీ, బడాయికి భజన చేసినప్పటికీ, చేసినపని పనికిమాలినదికాదు. ఆడంబరంతో ఆర్భాటంతో ఆరంభించినదే ఆఖరుకు ఆత్మశుద్ధికి సిద్ధపథమవుతుంది.

అయితే, ఒక్క సందేహం సర్వసామాన్యంగా కలుగుతూ ఉంటుంది. మనం లోకమర్యాదకోసంచేసేపనులుచాలాఉన్నాయి. ఇంటికి ఎవరైనా అతిథి అభ్యాగతి వచ్చినప్పుడు మర్యాదచేస్తాము. అతడు భోజనం చేసేటప్పుడు తనకు కావలసినవి అడిగి వడ్డించుకొనుటకు సహజంగా సిగ్గుపడ్తాడు. అట్టిసందర్భంలో మనము అతిథివంక చూచి "మీకు కావలసినవేవో అడిగి వడ్డించుకొని సావకాశంగా భోంచెయ్యండి. మీరేమీ సిగ్గుపడవద్దు. ఇది స్వగృహంఅనుకోండి"అని మర్యాదకోసం హెచ్చరించడంకలదు. కాని, ఇంటికి వచ్చిన అతిథి నిజంగా ఆ యింటిని స్వగృహం అని భావిస్తే, ఆ ప్రకారంగా ఆ యింట్లోనే స్థిరంగా మకాం చేసినట్లయితే, యింటి యజమాని హర్షించి ఊరుకుంటాడా? "మీరు ఈ వూరు వచ్చి వారంరోజులైనట్లుంది. వచ్చినపని పూర్తియైనట్లేనా? అయితే మీ తిరుగు ప్రయాణం ఎప్పుడు? నేను తిరిగి ఆఫీసునుంచి వచ్చేలోపుగా మీరు రైలుకువెళ్ళేపక్షంలో, నేను మిమ్మల్ని కలిసికొంటానో లేదో గనుక మనవాళ్ళందరినీ అడిగినానని చెప్పండి. మీకు యింటివద్ద వ్యవసాయపు పనుల రోజులు కాబోలు. అటువంటి సందర్భంలో మీరు యిక్కడ మా ఊళ్ళో కూర్చుంటే అక్కడి పనులు చెడిపోతాయి. నిజమే. మీరు సాయంత్రం రైలుకు వెళ్ళడమే ఉత్తమం. బస్సుకు వెళ్ళడం మంచిది కాదు. అప్పటికి నవమి వెళ్ళి దశమి ప్రవేశిస్తుంది. వర్జ్యంకూడా ఏమీ లేదు. ఇక తిరిగి పంచాంగం తిరగవేయ నక్కర లేదు. మీరు సాయంత్రం రైలుకు వెళ్ళడమే అన్నివిధములా ఉత్తమం. మీరు స్వగ్రామం చేరినతర్వాత ఉత్తరం మాత్రం తప్పకుండా వ్రాయండి. నామట్టుకు నాకు సొంత ఇల్లూ వాకిలీ సంసారం విడిచిపెట్టి పరాయిఊళ్ళో ఉండడం అంటే, పల్లేరు మీద కూర్చున్నట్లుంటుంది. పెళ్ళాం బిడ్డల కోసం కలవరించేటటువంటి మీబోటివాళ్ళు వారంరోజుల నుంచి ఇక్కడ మకాం చేసిఉన్నారంటే, ఎట్లా ఉండగలిగినారా అని నాకే ఆశ్చర్యంగా ఉంది. మీకెందుకు యీ ఊళ్ళవెంట తిరగడం? హాయిగా కృష్ణా! రామా! అంటూ ఇంటివద్ద కూర్చోవలసిన పరిస్థితి మీది. పరాయి ఊళ్ళల్లో తిరుగవలసిన ప్రాయం కాదు మీది. నేను వెళ్ళివస్తాను. సెలవు. దుర్ముహూర్తం ప్రవేశించక పూర్వమే మీరు ప్రయాణం కావాలి. పరుపు చుట్ట,ట్రంకుపెట్టె యిప్పుడే నెమ్మదిగా సర్దుకోండి. సెలవు! దయ ఉంచండి. త్వరగా వెళ్లాలి నేను ఆఫీసుకు" అని యీ విధంగా ఎంతో లౌక్యంగా వచ్చిన చుట్టమును సాగనంపుటకు సమయోచిత ప్రసంగమును చక్కగా చేస్తాడు గృహస్థు - ఎందుచేత?

ఇంటికివచ్చిన చుట్టమును వెళ్ళిపొమ్మని చెప్పడం ధర్మంకాదు. కాని, యింట్లో ఉన్న యిక్కట్టులను బట్టి, దీర్ఘకాల సత్కార సన్మానం సదరు అతిథికి ఆగృహస్థు చేయలేడు. వారంరోజులు మర్యాద చేశాడు. ఇక లాకు మట్టంచేసి గడపను దాటించవలెనని నిశ్చయించుకున్నాడు. చుట్టంమీద ప్రీతిఉంది. కాని, బియ్యం మీదకూడా ప్రీతిఉంది. ఆ కారణంచేత అతిథి మనస్సు నొచ్చుకోకుండా, అతనిని సాగనంపవలసి వచ్చింది. సమంత్రకంగా ఆహ్వానించాలి. సమంత్రకంగా ఉద్వాసన చెప్పాలి. నవరాత్రులు పూజలు చేసినటువంటి దేవికైనా అంతే - కాబట్టి లౌకిక మర్యాదగా చెప్పినమాటలలోగాని, పారలౌకిక దేవీఉపాసనలోగాని, ఆవాహన విసర్జనలనేవి రెండూఉంటాయి. ఇందులో కపటంగాని వికటంగాని ఏమీలేదు.

"దయ చెయ్యండి!" అంటే చాలు. అందులో ఉన్న అంతరార్థం అందులో ఉన్న పరమార్థం పరిపరివిధాల ధ్వనిస్తుంది. "తమరు మాయింటికి రావడం కేవలం మామీద పరిపూర్ణానుగ్రహమును సూచించడమే అవుతుంది. కనుక, ఆ ప్రకారంగా మామీద దయ ఉంచి విచ్చేయండి" అనే అర్థం స్ఫురిస్తోంది.

"మీరు మావంటివారిని విడిచిపెట్టినట్లయితే, మీరు ఉండేచోటికి మీరు చేరుకున్నట్లయితే, మాకు ఎంతో ఆవాఖదారిని బాధ్యతాభారమును తొలగించి మాయందు అనుగ్రహమును చూపినట్లవుతుంది. కనుక, మీరు దయవహించి నిష్క్రమించండి" అనే అర్థంకూడా "దయచెయ్యండి" అనే మాటలో స్ఫురిస్తుంది. ఇంత సొగసైన మాట ఇంగ్లీషు భాషలో కన్పించదు. ఏ పాశ్చాత్య భాషలోనూ కన్పించదు. "దయచెయ్యండి" అంటే, "ఇలా వచ్చికూర్చోండి!" అనే అర్థం చెప్పవచ్చు- "దయచెయ్యండి" అంటే, "దయయుంచి వెళ్ళండి!" అనే అర్థంలోకూడా చెప్పవచ్చు.

దీనినిబట్టి చూస్తే, ఈ "దయచెయ్యండి" అనే ఒక్కమాటలోనే ఎంతో ద్వంద్వార్థం ఉంది. ఎంతో వ్యతిరేకభావం ఉంది. ఒక్కమాటతోనే రెండువిధాలుగా ప్రవర్తించుటకు వీలైన కపటలక్షణం ఉంది. అందుచేత లోకమర్యాదలన్నీ కపటనాటకములనీ దొంగవేషాలనీ కుప్రియాలతో కూడిన శూన్యహస్తాలనీ, నిరసిస్తే నిరసించవచ్చు. కాని, మాటమర్యాదలనేవి లేకుండా సంఘమర్యాదలనేవి లేకుండా వ్యవహరించడం ఎట్లా సాధ్యమవుతుందో ఊహించలేము.

ఎవరైనా మర్యాదగా మాట్లాడి, మర్యాదగా ప్రవర్తిస్తే, అటువంటి వారిని "సరసుడు" అంటాము. సరసత్వం లేకపోతే, ఒక మనిషితో ఇంకోమనిషి పది నిమిషాలు మాట్లాడలేడు. దానినే పండితులు రసజ్ఞత అన్నారు. దానినే రసికత్వం అనికూడా అన్నారు. విశాఖపట్నంజిల్లా మొదలైన ప్రాంతలలో "సరసుడు" అనే మాటను "విటుడు" అనే అర్థంలోకూడా ఉపయోగిస్తారు. కారణం ఏమిటంటే, స్త్రీపురుషులమధ్య పరస్పర వ్యవహారప్రవర్తనలుగాని సంభాషణలుగాని, ఎక్కువ అనురాగపూరితంగా ఉండడమే కాకుండా ఎక్కువ అనుమానరహితంగా ఉంటూ ఉండాలి. అటువంటి సమయోచిత ప్రవర్తన, అటువంటి సంభాషణ సల్లాపములు చాలా అవసరము. హద్దు తెలిసి ప్రవర్తించడమే "మర్యాద". "మర్యాద" అనేది సంస్కృతపుమాట - దానికి తెనుగు అర్థం "హద్దు"-మన క్షేత్రం ఎంతవరకో, ఇతరుల క్షేత్రం ఎంతవరకో తెలిసికొని పాటించడానికి పాతించబడిన సర్వే రాళ్లు, మన సంఘమర్యాదలు-కాని, అంతమాత్రం చేత ఒకరి క్షేత్రంలోనుంచి నీరు ఇంకొకరి క్షేత్రంలోనికి ప్రవహించకూడదని యీ రాళ్ళుగాని, పొలం గట్లుగాని అడ్డుపెట్టడం లేదు. సహకారసాహచర్యసమష్టిసద్భావంతో కలిసి మెలిసి కరణాలా కాపులా గ్రామంలో కాపురం చెయ్యాలి. ఎవరి హద్దులు వారికే ఉన్నప్పటికీ, హద్దులకోసం గుద్దులాడుకొనమన్నట్లుగా "మన ఊరు" "మనగ్రామం" "మనరాష్ట్రం" "మనదేశం" అనే సమష్టిభావం ప్రకటిస్తూ ఉండాలి. "మన"లో ఉన్న ఈ అభిమానాలు ఎంతవరకు నిజం అని అనుమానించవ

కూడదు. ఎందు కవి యని యూహించ కూడదు.

ఇటీవల మద్రాసునుంచి ఒక అయ్యరు గారు ఆంధ్రరాష్ట్రంలో చేరిన ఒక డెల్టా గ్రామానికి ఓవరు సీయరుగా వచ్చారు. ఆయనకు తెనుగు బాగా రాదు. కాని, కొంచెంకొంచెంగా అలవాటు చేసుకొంటున్నాడు. ఆయన కాపురం ఉన్న ప్రక్క బజారులోనే స్కూలు పెద్దమాస్టరుగారైన చంద్రశేఖరంగారు కాపురమున్నారు. ఆయన మంచిస్థితిపరుడు. ఈయనకూ ఆయనకూ చాలా స్నేహంగా ఉంటూ ఉండేది. ఇద్దరికీ చీట్లపేక అంటే యిష్టం. ఈ చీట్లాటతో వారికి రాత్రి 9 గంటలవరకూ 10 గంటలవరకూ ప్రొద్దుపోతూ ఉండేది. ఏ అర్ధరాత్రికో ఆట ముగించి అన్నం తినుటకు వచ్చేవారు. చంద్రశేఖరంగారు చీట్లాటకోసం ఓవరుసీయరుగారింటికి వెళ్ళి అక్కడే కాఫీ తాగి, క్లబ్బునుంచి యింటికి వచ్చినట్లుగా కాలంగడిపి వచ్చేవాడు. ఒకనాడు రాత్రి 12 గంటలవేళ ఓవరుసీయరు అయ్యరుగారే స్వయంగా ఒక చిన్న టకోరా సన్నాయిమేళంతో చంద్రశేఖరంగారింటికి వచ్చి తలుపుకొట్టి నిద్ర లేపారు. ఆయనవెంట ఆయన మరదలు ఒక పడుచుపిల్ల కొత్తసిల్కుచీర కట్టుకొని, కుంకుమ భరిణ చేతిలో పట్టుకొనివచ్చింది. ఓవరుసీయరుగారు వచ్చిన సందర్భ కారణమేమిటంటే, ఆయనభార్య గర్భవతిగా ఉంది. ఆమెకు సీమంతం జరుపుటకు నిశ్చయించారు. ఇది అరవ అయ్యరు సోదరులు విత్తముకొద్దీ వైభవం అన్నట్లుగా జరుపుతారు. అయ్యరుగారు వీధివాకిట్లోకి రాగానే చంద్రశేఖరంగారు ఆయనకు ఎదురుగా వెళ్ళి "రండి దయచేయండి" అని వీధివాకిలి అరుగుమీద చాపవేశారు. అయ్యరుగారు కూర్చోవటండానే "అవసరంగా పోవాలి. మన భార్యకు వచ్చి రేపు సీమంతం నడుస్తుంది. మీరు ఖండితంగా ఆశీర్వదించేదానికి రావలె," అన్నాడు. ఆయన మరదలు లోపలికి వెళ్ళి చంద్రశేఖరంగారి భార్యకు బొట్టుపెట్టి, పేరంటానికి పిలిచింది. ఇంకా పది యిళ్లకు వెళ్ళి పిలువవలసిన పని ఉండుటవల్ల ఓవరు సీయరుగారు త్వరగా సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయారు.

చంద్రశేఖరంగారు యింట్లోకి వెళ్ళి తలుపు గడియవేసికొని నిద్ర పోవుటకు ప్రయత్నించారు. కాని ఆయనభార్యకు యీ పేరంటం పిలుపుయొక్క అర్థం ఏమిటో బోధపడక మనస్సులో మథనపడుతోంది. "మన భార్యకు సీమంతం" అనే మాటలు అయ్యరుగారు చంద్రశేఖరంగారితో చెప్పుతూ ఉంటే ఆమె స్పష్టంగా విన్నది. ఉభయులకూ ఉన్న చీట్లపేక సహవాసం మూలంగా అంత అన్యోన్యంగా ఉంటున్నారు కాబోలు ననుకొన్నది. అయినా, రాత్రిళ్ళు అంత పొద్దుపోయే వరకు అయ్యరుగారింట్లో ఆడుకుంటూ ఉండడం అనేక విధాల అనర్థకం అని ఆమె అనుమానిస్తునే ఉంది. ఆమె అనుమానించినట్లుగానే అందుకుతార్కాణంగా యీరాత్రి అయ్యరుగారువచ్చి స్పష్టంగా "మనభార్యకు రేపు సీమంతం"అని తన భర్తయైన చంద్రశేఖరంతో అన్నాడు. ఆమె మనస్సు పరిపరివిధాలుగా పరిభ్రమించింది. "మీకు యింట్లో నిద్దర పట్టక పోతే అయ్యరుగారింటికే వెళ్లి పడుకోండి!" అంది ఆవిడ నిష్ఠూరంగా. ఏమిటి యీ ధోరణి? అని చంద్రశేఖరం కొంతసేపు ఆమెతో తర్కించాడు. కొంతసేపటికి, ఆమె మనోభావంలో ఉన్న అనుమానదుమారం గ్రహించాడు. అయ్యరుగారు మర్యాదకోసం "మన యింట్లో, మన అబ్బాయికి అక్షరాభ్యాసం" అన్నట్లుగానే, "మన యింట్లో మన భార్యకు సీమంతం" అన్నాడు. కాని, ఆ మర్యాద మాటయొక్క హద్దు (మర్యాద) అయ్యరుగారు గ్రహించలేకతనభార్యా విషయంలో కూడా "మన భార్య" అనే మాట ప్రయోగించాడు. ఆ మర్యాద మాటలో సరసం ఉన్నదని అయ్యరు అనుకొన్నాడు. కాని, అయ్యరు భార్యకు చంద్రశేఖరం ఒక "సరసుడు" అని చంద్రశేఖరంగారి భార్య అపార్థం చేసికొన్నది. ఇదంతా చంద్రశేఖరం అవగాహన చేసికొని ఆ యిల్లాలుకు బోధపరిచేసరికి ఆయనకు ప్రాణం తల్లడిల్లిపోయింది. "మన" అనే సర్వనామార్థ నిర్వచనానికి నిఘంటువంత వ్యాఖ్యానం చేయవలసివచ్చింది.

మద్రాసు నగరమూ మనదే అని మనమూ వాదిస్తే, మనదే అని అరవ అయ్యర్లుకూడా వాదించారు. ఆఖరుకు శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచార్యులుగారు మద్రాసునగర విషయమై ప్రస్తావిస్తూ ఆంధ్రరాష్ట్ర విభజనగూర్చి ప్రసంగిస్తూ, "ఎవరైనా ఆస్తులను పంచుకుంటారు గాని, భార్యను పంచుకొనడం ఎక్కడా లేదు" అన్నారు. మద్రాసునగరాన్ని పంచుకొనడానికి వీలులేదన్నారు. "మనభార్య"అనేది ఉండడం అసంభవం - అయినప్పటికీ, మర్యాదకోసంమాత్రమే "మనభార్య" అనేమాట అరవసోదరుడు ప్రయోగించవచ్చునని భావిస్తాడు. కాని, ఆచార్యులవారి విషయంలో అపశబ్దభయంనాస్తి. వారివిషయంలో మనం అనుమానించకూడదు "సుధీగుణంబు దురితాఢంబు" చేయడం మంచిదికాదు.

—దాసు వామనరావు.

---

ఒకడు: అయ్యా అగ్ని ప్రమాదానికి గురియై నాయిల్లు దగ్ధమై పోయిందండి బాబు! రెండు దూలాలు ఇప్పించండి బాబు.

రెండవవాడు: ఇవ్వడేం సహాయం చెయ్యలేనోయ్. మరోసారి చేస్తాలే.

* * *

ఏమిట్రా బ్రదర్! నిన్న చాలాసార్లు బజార్లో; వీధుల్లో సినిమాహాల్సు బయట చూస్తున్నాను. ఎందుకు? అస్తమానూ అలా తిరుగుతావు?...

"అవును అదే నేనూ నిన్నడగా అనుకుంటున్నాను..."

* * *

ఒక ఇల్లాలు తన పిల్లవాడిని ఎత్తుకుని సముదాయిస్తూంది. కాని ఆపిల్లవాడు ఎంతకు ఏడుపు మానటంలేదు. ఆమె విసిగిపోయింది. ఇంతలో ఒక లావుపాటాయన అలా వెళ్ళటం ఆ యిల్లాలు చూచింది. లావుపాటాయన్నుద్దేశిస్తూ "ఊరుకో బాబూ! అదిగో... చూడు బూచి... ఎత్తుకు పోతాడు." పిల్లవాడి ఏడుపు రెట్టింపైంది.

శ్రీ ఏడిద గోపాలరావు, (కాకినాడ)

# ప్రేమ దేవత నవ్వింది

సరోజని వాకిట్లో నిలబడి చూస్తూ వుంది. సరిగ్గా అతను వచ్చే సమయం అదే. ప్రొద్దుటే తలంటుకున్న తల ఆరడానికని తల్లి కట్టిన పిడప విప్పి పట్టుకుచ్చులా వున్న బారెడు జుట్టూ రెండు పాయలు చేసి ఎడంపాయ చెవిపక్కన విలాసంగా వేలుముడివేసి కుడిపాయను వట్టివేళ్ళ కుంచితో చిక్కుతీసుకుంటూ సరోజని వాకిట్లో నిలబడి అతనికోసం ఎదురుచూస్తూ వుంది. ప్రతిరోజూ సరిగా అతను వచ్చే వేళ అదే. మూడు రోజులనించీ అతనికోసం తను యిలానే కాచుకుని వుంటూ వున్న సంగతి గుర్తుకొచ్చింది కాబోలు సరోజని పెదవి కొసల్లో వొక నవ్వు సన్నని వెన్నెల జీరలా కదిలింది. ఇన్నాళ్ళనించీ తను అతన్ని చూస్తూనేవుంది. కాని అతనుమాత్రం తనవేపే కాదు గుమ్మంవేపు కూడా చూడకుండా తనముందునించీ వెళ్ళిపోతున్నాడు. అతన్ని పిలిచి ఏమిటో మాట్లాడాలనుకునేది కాని ఆ లేత గుండెకంత నిబ్బరం లేకపోయింది.

అతనికోసం పడిగాపులుపడి కాచుకుని వున్నంతసేపైనా లేకుండా అతను చూచీ చూడనట్టు నిర్లక్ష్యంగా వెళ్ళిపోతూవుంటే తనమీద తనకే విసుగూ కోపం కలిగేయి. 'ఇల్లా అతనికోసం పిచ్చిగా చూస్తూంటే ఎవరన్నా నవ్వుతారు కూడా. ఇక చూడకూడ' దనుకునేది. అపట్టు ఎంతవరకూ? ఆ రాత్రితో చెల్లు! మర్నాడు మళ్లీ అతను వచ్చేవేళకు తనకు తెలియకుండానే కాళ్లు వాటంతటవే గుమ్మందగ్గిరకు నడిపించేవి. కళ్ళు వీధిని కలజూచేవి.

సరోజని వీధి మొగదలదాకా పరకాయించి చూచింది. అతను వచ్చే జాడా జవాబుకూడా కనిపించలేదు. అప్పుడే బడి వదిలిపెట్టినట్టున్నారు. తమ్ముడూ చెల్లాయి చేతుల్లో సంచులు వూపుకుంటూ వస్తున్నారు. ఈపాటికి అతను రావలసిందే మరి. త్రోవలో ఏం ఆలస్య మయిందో!

'వస్తున్నానే!' ఆ మాటకు పరధ్యానంలో వున్న సరోజని త్రుళ్లిపడి వెనక్కు తిరిగింది. పక్కవాటాలో అద్దెకున్న వాళ్ల అమ్మాయి లోపల్నించీ తల్లి పిలుస్తూంటే తమ్ముణ్ణి గురించి 'వస్తున్నానే!' అంటూ వుంది. తను త్రుళ్ళిపడ్డందుకు సరోజని నవ్వుకుంది.

చిక్కుతీసుకుని వొదులుగా జడ అల్లుకోవడం అయింది. 'బుల్లెమ్మగారూ! ఎప్పుడొచ్చారూ?' అంటూ బజారున పోతూ వున్న యింటి చాకలిది పద్దాయి వాకిట్లో నిలబడ్డ తన్ను చూచి పలకరించింది. దానికి సమాధానం చెపుతూవుండగానే తమ్ముడూ చెల్లాయి 'అక్కా, అయిస్క్రీం కొనిపెట్టవే' అంటూ చెయ్యి వొకళ్ళూ చెంగొకళ్ళూ లాగారు. 'అప్పులవాళ్లనన్నా తప్పించుకోవచ్చునేమో కాని వీళ్ళను తప్పించుకోలేం' అనుకుంటూ చెరో కానీ యిచ్చి వదిలించుకుంది. పిల్లలు చేతిలో కానీ పడ్డంతోనే బడిసంచు లక్కడే పడేసి పరుగెత్తారు. వాళ్ళను చూస్తూ వున్నట్టుగానే చూసింది అతను వస్తున్న జాడ కనపడ్డంలేదు.

శ్రీ బొడ్డు బాపిరాజు

వంటింట్లోనించి 'సరోజా!' అంటూ తల్లి ఎందుకో కేకవేసింది. వెంటనే వెళ్లకపోతే 'ఓంయ్' అన్నా అమ్మ వూపిరి సలపకుండా కేకమీద కేక వేస్తుంది. సరోజని కాసంగతి తెలుసు! మళ్ళీ వొకసారి అనుమానం తీరా వీధి యీ చివర్నించీ ఆ చివరివరకూ పారజూచి యింట్లోకి వెళ్ళిపోయింది అమ్మ పిలుపుకు.

అప్పమ్మ తోమిన అంట్లన్నీ తోలుచుకుని, దానికి కొంచెం పచ్చడివేసిన చద్దన్నం తపాలా యిచ్చి, అది వెళ్ళాక దొడ్డిగుమ్మం గొళ్లెంపెట్టి అమ్మకు కూర తరిగిచ్చి, పొయ్యి వూదే గొట్టం చారుతప్పాలా యిలా అన్నీ వొకటొకటీ అర్చుకుని తీర్చుకుని అమర్చి వచ్చేసరికి అరగంట పట్టింది. సరోజని లోపలినించీ వాకిట్లోకి రావడం అతను గుమ్మం దాటి వెళ్ళిపోవడం ఆ వొక్క క్షణంలో జరిగాయి. ప్రొద్దుట్నించి ఆ పిల్ల పడ్డ ఆపసోపాలన్నీ అంతలో వృథా అయిపోయాయ్. పాపం పిచ్చిపిల్ల! కళ్ళనిండా నీళ్లు నిలిచాయి.

*　　　*　　　*

సరోజని అత్తవారింటికి కాపరానికి వెళ్ళాక పుట్టింటికంటూ రావడం యిదే మొదటి పర్యాయం. సరోజని మామగారు మంచి పేరున్న లాయర్. పేరుతోపాటు డబ్బూ సంపాదించాడు. నౌకర్లూ చాకర్లతో డాబూ దర్పంగా వుంటుంది కుటుంబం. అందుకు తగినట్టు రాజమహల్లాంటి చక్కని మేడ. ఇద్దరే కొడుకులు. వయసులో కన్న కొడుకూ, పోగు చేసి కొన్న ధనమూ అన్నట్టు చేతికందిన పెద్దవాడు సుందరం పట్టాపుచ్చుకుని తండ్రికల్లీ నీడల్లో ప్రాక్టీస్ ప్రారంభించాడు. సుందరం కోరిక ప్రకారం కట్నాలూ కానుకలూ లెక్కచెయ్యకుండా చందన బొమ్మలాంటి సరోజనిని కోడలుగా చేసుకున్నాడు లాయర్ గారు.

ప్రథమంగా కాపురానికని తీసుకు వెళ్ళడానికి సరోజని అత్తగారూ మరిదీ వచ్చారు. అమ్మనీ నాన్ననూ తోబుట్టిన వాళ్ళనూ పుట్టి పెరిగిన యింటినీ చిన్నప్పట్నించీ కలిసీ మెలిసీ తిరిగిన యిరుగూ పొరుగుల్నీ చెలికత్తెల్నీ యిందర్నీ విడిచిపెట్టి వెళ్ళడం అంటే సరోజనికి చాలా కష్టమే అనిపించింది. కాని వీటన్నిటికన్నా బలంగా ఆ చిన్ని హృదయాన్ని ఆకర్షిస్తూ వున్న ఒక మాధుర్యం ఆహ్వానిస్తూ వుంటే ఆమెకు వెళ్ళడం ఆనందంగానే వుంది. ఇదే మొదటిసారి కనుక పుట్టింటివారు వున్నంతలో సారె చీరా సున్నీ పసుపూ చలిమిడీ పెట్టి పంపారు. కొత్తగనుక పిల్లతోపాటు 'ఇంటివాళ్ళ' నిద్దర్నీ తీసుకుని తల్లి కూడా అమ్మాయి అత్తవారింటికి వెళ్ళింది.

అత్తవారింటివద్ద వున్న పది పదియేను రోజులూ నిమిషాల్లాగా తియ్యని కలల్తో గడిచిపోయాయి. అత్తగారి ఆదరం, మామగారి మమతా, మరిది సరదాలూ అన్నిటికన్నా తన్ను ఆకాశపు అంచుల కెత్తిన ఆయనగారి అనురాగబంధమూ 'ఇదే నా కొత్త చోటు?' అనిపించి ఆ కన్నె తల పుల్కి వుక్కిరి బిక్కిరి చేసివేశాయ్. కొన్నాళ్ళకు నాన్న వచ్చి 'ఒక నెల్లాళ్ళుపోయాక మళ్ళీ పంపిస్తా'నని మామగారితో చెప్పి అమ్మనూ తననూ తీసుకువచ్చాడు.

అక్కణ్ణించీ వచ్చాక రెండు మూడు రోజులవరకూ ఆ సువాసనలూ, తియ్యదనాలూ, కలలూ, వెంటాడుతూ వుంటే చెలికత్తెల్తో చుట్టపక్కాల్తో యిరుగు పొరుగుల్తో అక్కడి అత్తవారింటి ముచ్చట్లు చెప్పుకోవడంతోనే సరిపోయింది.

అక్కడ్నించీ వచ్చిన మూడోనాడనుకుంటా అతన్ని వీధిలోనించి వెడుతూ వుంటే హఠాత్తుగా చూసింది సరోజిని. ఆచిన్ని మెదడులో ఎన్నో తియ్యతియ్యని ఆలోచనలు వరదలనాటి కొండవాగులో అలలు సుళ్లు తిరిగినట్టు తిరిగాయి. తెల్లని వెన్నెలరాత్రులూ, తడిసిన సముద్రపు తీరాలూ చల్లని వుద్యానవనాలూ వొకటొకటే కళ్ళల్లో కదుల్తూ వున్నాయి సిగ్గుతో సరోజిని పచ్చనిచెక్కిళ్లు ఎఱ్ఱబడ్డాయి.

* * *

ఒకరోజు కొకరోజు సరోజిని మన్నుతిన్నపాములా మరీ ముందకొడిగా వుంటూ వుంది. ఏపనిచేస్తున్నా మన సెక్కడో పెట్టుకున్నట్టు చేస్తుంది. ఏమాటా వొకటికి రెండుసార్లూ చెపితేనేకాని వినిపించుకోదు. వినిపించుకున్నా ఆమాట అర్థం మనస్సుకు పట్టనేపటదు. ఆ పరాకుకు తోడు చింతాకంత చిరాకుకూడా తోడయింది. అన్నిటికన్నా పరధ్యాన్నం ఎక్కువయింది. ఉప్పడిగితే పప్పిస్తుంది. 'పులుసులోకి నాలుగువంకాయలు ముక్కలతరిగివ్వు తల్లీ' అని తల్లి చెపితే, అవికాస్తా వేపుడుముక్కలు తరిగూరుకుంటుంది 'ఇదేమే?' అంటే 'వినలేదులే' అని జవాబు. గట్టిగా అడిగితే కన్నీళ్లే జవాబు. ఈ అయిదారు రోజుల్లో గాజు పళ్లాలయితేనేం కాఫీ కప్పులూ సాసర్లయితేనేం అరడజనుకు తక్కువకాకుండా పగలకొట్టింది. 'ఏమిటే అమ్మా! ఇదంతా యిక్కడ గనక సరిపోయింది. యిదే అత్తవారింట్లో అయితే ఎలాగే? అని తల్లి అంటుంది. సరోజినిమాత్రం 'నావొంట్లో బాగోలేదే' అంటుంది. అక్కడితో తల్లి యిక మాట్లాడదు.

ఎన్నింటిమీద అశ్రద్ధా చిరాకూ పరాకూ వున్నా టంచన్‌గా అతను వచ్చే వేళకు వాకిట్లో నిలబడ్డంలో మాత్రం ఏ పరాకూ వుండదు. 'నాన్నా అమ్మా చూస్తే ఏమనుకుంటారో!' అని మధ్యమధ్య అనిపిస్తూవున్నా ఆ ఆకర్షణనించీ తన్ను తను సంబాళించుకోలేకపోతూవుంది. అతనికోసం కాచిపెట్టుకుని వుండడంలోని ఆతియ్యనిబాధ తనకే తెలుసు. అప్పుడేయీప్రతీక్ష మొదలై పదిరోజులు దాటింది. ఇంతవరకూ వొక్కసారీ అతనిచూపు సరోజినివేపు వాలనేలేదు. అసలతను ఆ అమ్మాయి వునికినే గమనించినట్టు లేదు. ఒకసారి మాత్రం



ఒకటి రెండుసార్లు ఆ అమ్మాయి అతను వచ్చే వేళకు తన మోస్తరే గుమ్మంలో తారట్లాడడం సరోజిని చూచింది... తనలో తను "బాగుందిలే వరస!" అనుకుంది.

గుమ్మంలోవున్న నాన్న అతన్ని పలకరించినట్టున్నాడు. అతనేదో నవ్వుతూ జవాబు చెప్పుకుంటూ వెళ్లిపోయాడు. అమ్మకేదో వంటింట్లో అందిస్తూవున్న తను లోపల్నించే చూసిందివంతా.

సరోజిని మేనత్త తమ్ముణ్ణీ మరదల్నీ చూడ్డానికంటూ వచ్చింది. ఆవిడంతావి అదో చాదస్తపు తరహా. తగని ఆచారం. అందుకు సరిపోయినంత అనుమానం. ఆచారంలో నిప్పైనా కడుగుతుంది. అనుమా

# ★ ప్రేమదేవత నవ్వింది ★

నంలో అరుంధతినైనా నిలబెడుతుంది. తన మడి ఎక్కడ చెడుతుందో అని వస్తూనే వంటిల్లు ఆక్రమించుకుంది. తను వున్నాన్నాళ్ళు మరొకర క్కడ అడుగుపెట్ట డానికి వీల్లేదు. వంటపని తప్పిందన్నమాటే కాని తల్లికీ సరోజినికీ ఆవిడ కదనీ యిదనీ అందించడంలో అంచె గుణాలు పరిగెత్తి నట్లు పరిగెత్తవలసి వచ్చేది.

సరోజినివాలకం మేనత్త వచ్చిన మర్నాడే పసికట్టింది. ఏపని చేస్తున్నా, ఎంతఅవసరంలో వున్నా ఆ సమయానికి వాకిట్లో మకాం వెయ్యడం ఆవిడ కర్థం కాలేదు. 'కాపురం చేసుకుంటూన్న పిల్ల అల్లా గుమ్మాన్ని పట్టుకు వేలాడ్డం ఏమిటో' అనుకుంది. 'ఏం వొరిగిపోతూవుందే అమ్మా! ఎప్పుడూ వాకిట్లో పీటంవేసు కూర్చుంటావ్!' అని కోడల్ని మందలించ నేమందలించింది. 'ఏమో బాబూ! యీ కాలప్పిల్లలూ, అలవాట్లున్నూ! మా అమ్మ అత్తగారికంటే కూడా అదుపు చేసేది. పెళ్ళికో పేరంటానికో బయల్దేరినప్పుడు తప్ప వీధి గుమ్మమంటూ చూడనిచ్చేదా? ఆ అదుపూ ఆగ్నే వేరు! యిప్పు డెక్కడున్నాయ్?' అంటూ స్వగతం సాగించేది. సరోజిని తల్లికి తెలుసు ఆడబిడ్డ యీమాట లెవర్ని గురిచూచి కొడుతూవుందో.

సరోజినికి మేనత్తను కనుగప్పి వెళ్ళడమనేది ఎంత కష్టమయేదో—ఆవేళకు వాకిట్లోకి వెళ్ళకుండా వుండడంకూడా అంత కష్టమయేది. పోనీ అత్తయ్యతో 'ఇదీ సంగతి...' అని చెపితే విని వూరుకుంటుందా? దానితో సువార్తా, వొక నీతిశాస్త్రమూ 'మా కాలంలో—' అంటూ ప్రారంభిస్తుందేమో అని సరోజిని భయం. ఈకాలపు అనురాగపద్ధతులూ, మనస్తత్వాలూ బొత్తిగా ఎరుగని యిక్ష్వాకుల నాటిది; ఆవిడతో 'ఏమిటి లె'మ్మనుకుంది చివరికి సరోజిని.

మళ్ళీ సరోజినికి తెరిపిచ్చింది. అయిదారు రోజుల్లో అత్తయ్య 'ఆచారం సాగడం లే'దంటూ వాళ్ళ పల్లెటూరికి వెళ్ళిపోయింది. 'అమ్మయ్యా!' అంటూ సరోజిని నిట్టూర్పు తీసుకుంది.

* * *

సరోజిని గమనిస్తూనేవుంది తను. అతను ఆ ఎదరింటికి మాత్రం తప్పకుండా రోజూ వెడుతూవుంటాడు. ఒకరోజున తను అతనికోసమన్నట్లు గుమ్మంలో నిలబడి వుంది. ఎవరితోనో మాట్లాడుతూ అతను గుమ్మం ఎదుటే నిలబడ్డాడు. చివరికి తనవేపు తిరిగాడు. వస్తాడనుకుని తను చావిట్లోకి తప్పుకుంది. కాని అతను రాలేదు. ఆపక్క నెక్కడికో వెళ్ళాడు. మరోసారి మరీ విచిత్రం! అత[illegible] యింటి ముందునించి తల వంచుకుని వెళ్ళిపోతున్నాడు. సరోజిని చూస్తూనే వుంది. వాళ్ళింటికి యెదురు అయిదో యిల్లో ఆరో యిల్లో కోమట్లది. మొన్న నే వాళ్ళ రెండో అబ్బాయి పెళ్ళాం కొత్త కోడలు వొచ్చింది. పిల్ల నేవళంగా చాలా నాజూగ్గా వుంటుంది. ఆ అమ్మాయి కూడా అత[illegible] కోసమే అన్నట్లు అతను వాళ్ళ గుమ్మం దాటే దాకా చూస్తూనే వుంది. అది సరోజిని చూచింది. మళ్ళీ వొకటి రెండుసార్లు కూడా ఆ అమ్మాయి అతను వచ్చే వేళకు తన మొస్తరే గుమ్మంలో తారట్లాడడం సరోజిని చూచింది. తనలో తనే 'బావుందిలే వరస!' అనుకుంది.

ఆరోజున అమ్మ తలంటువారం పెట్టింది. నాన్న తలంటుకుని స్నానంచేసి బజారు కెళ్ళిపోయాడు. తనకు నాసి అమ్మ పోసుకుంది. బళ్ళోనించి పిల్లల్ని కూడా పిలిపించింది. తమ్ముడి తలంటయింది. చెల్లాయికి నలుగు పెడుతూవుంది. అతను వచ్చే వేళయింది. తన ధ్యానం అంతా ఆటే వుంది. నలుగయ్యాక చెల్లెలికి రసం పొయ్యాలి. వెళ్ళడానికి వీల్లేదు. ఆ నలుగన్నా త్వరగా తెమిలేనా? చెల్లాయి పేచీల్తోనే సరిపోయింది. ఇందాక అమ్మ అననే అంది. 'ధ్యానం ఎక్కడ వుందే? నేనిటు

(53 వ పేజీ చూడండి)



 

# గుంటూరు

**శ్రీ రాచకొండ విశ్వనాధశాస్త్రి**

గొప్ప ముప్పు తెచ్చిపెట్టింది అతని గుంటూరు చదువు.

అతని పేరు అప్పల నరసింహం.

అతను విజయనగరంలో పుట్టేడు. విశాఖపట్నంలో పెరిగేడు.

అతనికి గుంటూరంటే ఇష్టంలేదు.

అతను నల్లిని చంపడు. పిల్లిని కొట్టడు. ఎన్నో విషయాల్లో అతను మంచివాడనే చెప్పాలి.

కాని అతనికి గుంటూరువాళ్ళయందు ఘోరమైన ద్వేషం ఉంది.

సైజుకి అతను ఉల్లిపాయంత మనిషి ఉంటాడు. అతను అందగాడని చెప్పడానికి అవకాశం లేదు. అతని ఛాయ నలుపు. అతను వికారంగా ఉంటాడని చెప్పడానికి చాలా అవకాశాలు ఉన్నాయ్.

అతను బి. కామ్ పరీక్ష పాసయేడు. విశాఖపట్నంలో ఒకంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు.

అతని తండ్రి అతణ్ణి "నరసన్నా" అని పిల్చేవాడు. అతను అలా ఇప్పుడు పిలవటం లేదు. అతను చనిపోయేడు.

నరసన్న తల్లి పేరు సముద్రాలమ్మ. చేటలో బియ్యం చెరుగుతూ ఇరుగుపొరుగు అమ్మలక్కల్తో "మా నరసన్న ఉన్నాడే..."అంటూ గొప్పలు చెప్పే అలవాటు ఆమెది. ఆ అలవాటు ఆమెకి ఇప్పటికీ ఉంది.

నరసన్నని నాకు చాలాకాలంనుంచీ బాగా తెలుసు. అతను నాకంటె రెండు సంవత్సరాలు చిన్న. అంటే, అతనికి ఇప్పుడు ఇరవైఎనిమిది సంవత్సరాలు. అతను నాకంటె రెండుక్లాసులు వెనక, అంటె, నేను బియ్యే పాసయిన సంవత్సరం అతను ఇంటర్మీడియేటు పరీక్ష పాసయేడు. ఆసంవత్సరం విశాఖపట్నం మీద జపాన్ వాడు బాంబులు వెదజల్లేడు. ఊళ్లోంచి చాలామంది తోకలు ముణుచుకొని వెళిపోయేరు. ఆంధ్రాయూనివర్సిటే గుంటూరు వెళ్లింది.

నరసన్న బి. కామ్ చదువు గుంటూర్లో జరిగింది.

అప్పట్లో ఆరంభమయింది నరసన్న రోగం; అనగా గుంటూరుయెడల ద్వేషం.

నిజంగా అదొక రకమైన రోగం.

రెండేసి రోజులకి ఒకసారయినా గుంటూరు వాళ్ళనీ, ఆ జిల్లావాళ్ళనీ తిట్టకుండా ఉండలేడు అతను. వాళ్ళను తల్చుకుంటే తనకి నిద్రపట్టదని అతను ఎన్నోసార్లు చెప్పేడు. అతనికి వాళ్ళమీద ఒక విధమైన పగ; ఒకరకం కసి.

అది ద్వేషమనే జబ్బు.

జబ్బుకి కారణం ?

లక్షోయాభై కారణాలు ఉండవచ్చు.

లక్షోయాభై కారణాల్లోనూ ముఖ్యమైనది 'వెక్కిరింత' వేళాకోళం.'

అని నేననుకొందికి కారణం—

అక్కడవాళ్ళు అన్న మాటలన్నీ తల్చుకొని, చెప్తూ నరసన్న మండిపడిపోతూ ఉండడం.

గుంటూర్లో, ఎవరో అనామకులు ఎన్నో రకాలుగా వెక్కిరించేరట. విశాఖజిల్లా వాళ్లనీ విశాఖపట్నం మనుష్యుల్నీ, నరసన్ననీ. ఆ రకరకాలు ఇవి:

"మీ పేరు 'అప్పల్సామా', లేక అప్పల నరసింహామా ?"

"మీది 'ఒయిజాగు' కాబోలుఏమండీ?"

"అసలైన ఆంధ్రా కల్చరు చూడాలంటే గుంటూర్లో చూడాలి. మీ తూర్పువాళ్ల 'ఏటి' 'కూకో' కల్చరు ఆంధ్రా కల్చరంటే మాకు సిగ్గు సిగ్గు."

"అప్పలస్వామిగారికి,...సారీ... అప్పల నరసింహంగారికి 'పెన్ను' కావాలట."

"క...అప్పల నరసింహంగారూ, మీకు దువ్వెన అక్కర్లేదా ?"

"వైజాగ్ వాళ్లకి తిండెక్కడయ్యా ఉంది ?"

"మీ ఊళ్ళో ఇసకపర్రలూ, రాతి కొండలూ, ఎర్రమన్నూ, ఉప్పునీరూ ఉన్నాయంటే ఒప్పుకుంటాం."

"ఇన్నో అప్పల్నర్సింవంగోరు! ఎప్పుడొచ్చేసేరు! సెల్యవల్లో కూల్పనుల్ర ?"

"అప్పల్నర్సింవంగోరు మాట్లాడుతున్నారు. శ్రద్ధగా వినండి."

"కప్పల్సాం! కప్పల్సాం! అణాపరక! అణాపర్క."

ఇలాటి చిల్లర హాస్యపు, వేళాకోళపు మాటలు, ప్రతి ఊరిగురించీ మరో ఊరివాళ్ళు అనడం ఆంధ్రదేశంలో కద్దు. వాడు వీణ్ని వెక్కిరిస్తే, వీడు వాణ్ని వెక్కిరిస్తాడు. అది అంతటితో ముగుస్తుంది.

నరసన్నలో, అది అంతటితో ముగియక పోడానికి కారణం, అతను ఇంకొకర్ని వెక్కిరించలేడు. వెక్కిరించే అలవాటు లేదతనికి. నలుగురితోనూ వాదించడానికి అతను మొహమాటపడతాడు.

అందుచేత కోపంతో దహించుకుపోతూ ఉంటాడు.

అన్ని వెక్కిరింతల్లోకీ నరసన్నలో ద్వేషం, విషం, తెచ్చిపెట్టినది, అక్కడవాళ్లు, ఇక్కడ చుట్టకాల్చడం గురించి చేసే వెక్కిరింత.

విశాఖజిల్లాల్లో కొందరు ఆడవాళ్లు చుట్టలు కాల్చడంగురించి విశాఖజిల్లాలకి చెందని మిగతా ఆంధ్రులు, సిగ్గుపడ్డం, చేసెరుగుదును.

ఓ వూళ్లో ఓసారి, ఓ కాఫీహోటేల్లో నేను టిఫిన్ తీసుకొంటూంటే పక్క బల్ల దగ్గర ఓ అరవ్వాడూ, ఓ తెలుగువాడూ మాట్లాడుకొంటున్నారు.

"మీ ఆంధ్రాస్ గురించి మీ నాగరికత గురించీ పెద్దమాటలు నాతో చెప్పకు. మీ ఆడాళ్లంతా చుట్టలుకాలుస్తారు. షేమ్ షేమ్" అన్నాడు అరవ్వాడు, ఇంగ్లీషులో.

తెలుగువాడి ముఖంలో సిగ్గూ, బాధా కనిపించేయి.

ఆంధ్రుల్లో ఆడవాళ్లంతా అలా చుట్టలు కాల్చరనీ, ఒక్కవిశాఖవాళ్లే అలా చేస్తారనీ, విశాఖ వాళ్లకీ మిగతా ఆంధ్రులకీ చాలా తేడా ఉందనీ.

చాలా చెప్పి, దక్షిణాదివాణ్ని నమ్మించడానికి ఘోరమైనప్రయత్నంచేసి, చివర్న ఆఖరిమాటగా, గట్టిగా,

"వైజాగ్ వాళ్లు ప్యూర్ ఆంధ్రాస్ కారు" అన్నాడు ఆ తెలుగువాడు.

"కాలుస్తే కాలుస్తారు! కాల్చడం అనాగరికత అని ఎలా అంటావ్ నువ్వు?" అని ఆ అరవ్వాణ్ని దమాయించి అడక్కుండా.

# ★ గుంటూరు ★

నాకు వాళ్ళిద్దరిమీదా చాలా కోపం వచ్చింది.

("చాలా కోపం వచ్చి ఏం చేశావ్ నువ్వు?" అని నన్నెవరూ అడగవద్దు)

నరసన్నకూడా ఈ విషయం తల్చుకున్నప్పుడల్లా విపరీతమైన కోపం కలుగుతూ ఉంటుంది.

"రోజల్లా కూలీనాలీ చేసిన ఆడవాళ్ళు ఓ చుట్టా కాల్చక, ఓ మంచినీటి చుక్కా తాగక చస్తారా" అంటాడు నరసన్న ఈ టాపిక్ వచ్చినప్పుడల్లా.

నేను [illegible] విషయంలో అతన్తో తప్పక ఏకీభవిస్తూ ఉంటాను.

చుట్టకాల్చే ఆడవాళ్ళ శీలాన్ని గురించి కూడా శంకించడం చాలా అన్యాయం.

వాళ్ళ శీలాన్ని కూడా శంకిస్తూ అన్న మాటలు నరసన్న చెవుల్లో ములుకుల్లా గుచ్చుకొని ఉంటాయి.

మామూలువాళ్ళు అలాంటి మాటల్ని చవకరకం వేళాకోళంకింద తీసుకుంటారు. నరసన్న ఆమాటల్ని అలా తీసుకోడు. తీసుకోక, ఆగ్రహావేశపరుడై పోతాడు.

అందుకు కారణం ఉంది.

విశాఖజిల్లాలో పాటకపుజనం, ఆడామగా కూడా, చుట్టలు కాలుస్తారు.

నరసన్న తలిదండ్రులు పాటకపు జనంలోంచి వచ్చేరు.

నరసన్న తండ్రికి ఉంటే ఒకే ఒక పెద్ద ఆశ, కొడుకుచేత పెద్దచదువు చదివిద్దామనేది.

ఎంతో కష్టపడి, శుమటోడ్చి అతను సెరవేర్చుకున్నాడు తన ఆశ. తరువాత చనిపోయేడు.

నరసన్న తల్లి ఇంకా జీవించే ఉంది. ఆమె ఇప్పటికీ చుట్టకాలుస్తుంది.

చుట్టకాల్చే ఆడవారిగురించి ఆలోచించుకోకుండా, అర్థంపర్థం లేకుండా పైవాళ్లు చేసే వెక్కిరింతవల్ల నరసన్నకి ఎందుకంత కోపం, పట్టరానికోపం కలుగుతుందో నాకు అర్థం అవుతుంది. పైవాళ్లకి అర్థం కాదు.

చుట్టకాల్చే ఆడవాళ్లని గుంటూరు వాళ్లు వెక్కిరించినందువల్ల నరసన్నకి గుంటూరు వాళ్ళమీద తెగకోపం; చుట్ట కాల్చే ఆడవాళ్లయందు అభిమానం.

నాకు చుట్ట కాల్చే అలవాటు ఉంది.

ఓ సారి నేను అతనింట్లో కూర్చొని అతన్తో మాట్లాడుతూ వాళ్ళ ఇంటి పనిమనిషిని బజార్లోకి వెళ్లి నాకు చుట్టలు పట్టుకురమ్మన్నాను. పై ఇంటి పనిమనిషి చేత వట్టి నే పని చేయించుకోడం ఇష్టంలేక "కావలిస్తే నువ్వో అణా చుట్టలు పుచ్చుకో" అన్నాను ఆమెతో.

"ఇకా! అందర్నాగా నా ను సుట్ట కాల్సను" అంది ఆమె డబ్బులు పుచ్చుకొని బయల్దేరుతూ.

నరసన్న ఒక్కక్షణం చూసేడు ఆమె వైపు.

ఆ మర్నాడే ఆమెని పనిలోంచి తొలగించేడు.

చుట్టకాల్చని పనిమనిషిని చూసి అసహ్యించుకున్న నరసన్న వైజాగ్ లో కొద్దిరోజులు ఉన్నాడు. అయినా పొట్టిగా ఉండడం సహించలేడు.

"మాపాటి పొడవు మనుష్యులు మన దేశంలో ఎక్కడో కాని కనిపించరు" అనేవారట గుంటూర్లో.

"మావైపుకూడా పొడవుగానే ఉంటారు" అనేవాడట నరసన్న.

"అవునవును. నిన్ను చూస్తేనే తెలుస్తోంది" అని వికవిక నవ్వేవారట వాళ్లు.

నరసన్న పొట్టివాడవడం ఓ గొప్ప దురదృష్టం.

"మా జిల్లాలో అంతా నాలాగ ఉండరని చెప్పడం ఎలాగలాగ?" అనిపించేదట నరసన్నకి.

విశాఖపట్నం వాళ్ళు ఆ వూళ్లో ఎవరు ఉన్నారో ఆదిలో అతనికి సరిగా తెలియలేదుట. తరువాత ఓ నలుగురు విశాఖపట్నం మనుష్యుల్ని స్నేహితులుగా చేసుకున్నాడు గుంటూర్లో.

వాళ్ళు ఇప్పటికీ తరచుగా నరసన్నదగ్గరికి వస్తూంటారు. అందుచేత నాకూడా వాళ్లని తెలుసు. నలుగుర్లోనూ, ఒకడు బొబ్బిలి వెలమ; ఒకడు గజపతి నగరం పంతులు; ఒకడు డెంకాడ రాజు; ఒకడు అనకాపల్లి గవర. ప్రస్తుతం అమల్లో ఉన్న నైతిక చట్టం ప్రకారం వాళ్ళు పెక్కలి దుష్టులు. సంతకం చేయని లవ్ లెటర్సు ఎడం చేత్తో రాయడం, చీకట్లో గంటలకొద్దీ మాటు కాయడం, మోతాదుగా 'మందు' సేవించడం, దుకాణాల్లో అతి సులభంగా అరువు తెచ్చుకోడం, మొహమాటం లేకుండా అప్పులు ఎగ్గొట్టడం, చక్కటి అబద్ధాలు ఆడ్డం, ఇలాటి పనుల్లో వాళ్ళకి మంచి తర్ఫీదు ఉంది.

"వాళ్ళతో ఏలా స్నేహం కలిసిందిరా నీకూ?" అని నేను ఆశ్చర్యపడ్డాను మొదట్లో.

వాళ్లు అతనికంటె బాగా పెద్దవాళ్ళు గుంటూర్లో ఉద్యోగాలు చేసేవారు.

"వాళ్లు గుంటూర్లో ఉండేవాళ్లు. మనవైపు వాళ్లు."

"అయితే?"

"మనవైపు వాళ్లు అటువైపు తక్కువ." అని కొంతసేపు ఊరుకొని

"అదీగాక, మరి, వాళ్ళు, అక్కడ చాలామందికంటె కూడా పొడవు" అన్నాడు నరసన్న.

వాళ్లు నలుగురు జమా జెట్టీల్లా ఉంటారు. బలిత మహారాజు గుణాలేవీ వాళ్లల్లో లేకపోయినా, వాళ్ళల్లో ప్రతి ఒక్కడూ కూడా "సాలప్రాంశుర్మహాభుజః" అన్నట్లుగానే ఉంటారు.

గుంటూరు వాళ్ళ వెక్కిరింతకి జవా

బుగా, నాలుగు పొడవైన జవాబులు చూపించేవాడు నరసన్న.

అప్పట్లో గుంటూరు వాళ్ళకి "అన్డీ స్పాట్" చూపించడానికి ఉపయోగపడిన ఆ స్నేహితుల్లో ఎన్ని తప్పులున్నా సహేతుకంగా క్షమించి పారేస్తాడు అతను.

గుంటూరంటే ఇష్టంలేని వాళ్లని చూస్తే నరసన్నకి ఇష్టం.

నేనూ, నరసన్నా ఓ రోజున బస్సులో విజయనగరం వెళ్తూంటే ఆ బస్సులోనే మరో కాయన్తో నాకు పరిచయం ఏర్పడింది.

"మాది ఈ క్షేత్రం కాదు. మాది కర్నూలు జిల్లా" అన్నాడతను. మాతో దేశానికి జిల్లాకి తేడా లేకుండా మాట్లాడిన ఆ ఆసామీ కడప రాళ్ళ వ్యాపార సందర్భంలో కర్నూలునుంచి విశాఖపట్నం వచ్చి విజయనగరం వెళ్తున్నాడు.

అతనికి సర్కారు వాళ్ళంటే ఇష్టం లేదనేది స్పష్టం. మేంకూడా సర్కారువాళ్లం కాబట్టి, మా అందర్నీ తిట్టినట్టుగా కాకుండా, రేవలసీమకి పక్కగా ఉన్న గుంటూర్ని విమర్శించడం ప్రారంభించేడు అతను.

అతణ్ని ప్రాణమిత్రుడిలాగ, ఆప్తబంధువులాగ ఆ బస్సులోనూ, విజయనగరంలోనూ, కూడా ఆదరించి చంపేసు నరసన్న, గుంటూరంటే అతనికి ఇష్టంలేదన్న వాసన వేయగానే.

గుంటూరుజిల్లా వాళ్ళకి మంచి కలగడం నరసన్నకి ఇష్టం లేదు. వాళ్ళకి చెడ్డ కలుగుతే నరసన్న అట్టే విచారించడు.

మద్రాసులో ఓ ఇంగ్లీషు దినపత్రికలో సంపాదక వర్గంలో ఉండే ఓ చదువుకొన్న వాన్ - ఆంధ్రా జెంటిల్ మాన్, ఆంధ్రదేశంలో తుపాన్ వల్ల చాలా నష్టం కలిగిందనీ, చాలామంది చనిపోయారనీ విన్నప్పుడు సంతోషంతో ఆఫీసులో అందర్నీ కౌగలించుకున్నాడని విన్నప్పుడు నేను చాలా షాకయేను.

అంతటి విపరీతమైన మనస్తత్వాలు ఉంటాయని నేను ఎన్నడూ అనుకోలేదు.

నరసన్న చాలా మంచివాడు. అతను చెడ్డవాడు కాడు. కాని కొన్ని దుర్గుణాలు ఇటువంటివి ఉన్నాయి. లోకంలో ఎవ్వరి మీదా ద్వేషం లేదతనికి. గుంటూరు వాళ్ళ మీద తప్పించి.

గుంటూర్లో ఎండల తీవ్రత గురించి 'పేపర్లో' ఎంత చిన్న వార్త ఉన్నప్పటికీ అతను చదువుతాడు. గుంటూర్లో వడ దెబ్బ వల్ల ఎవరో చనిపోయారని ఎప్పుడైనా పడే వార్త చదివినప్పుడు కలిగిన సంతోషం, అమానుషం అని అతనికి తెలుసు. అందుచేత ఆ సంతోషాన్ని దాచుకొండికి ప్రయత్నిస్తాడు. "గుంటూరులో నీటి ఎద్దడి" అనే శీర్షిక అతను తరచు చూసేవాడు. ఇటీవల అక్కడి మంచినీటి సప్లయి గురించి పత్రికలో చదవడానికి ఎక్కువ సరదా చూపించలేదతను. గుంటూర్లో మెడికల్ కాలేజీ పెట్టినప్పుడు బెజవాడలో పెట్టరాదా ? బందర్లో పెట్టరాదా? మధ్య ఆ గుంటూర్లో ఎందుకు పెట్టాలి? అనీ గింజుకు పోయేడు.

పొట్టి శ్రీరాములు గారు తపస్సు చేసిన రోజుల్లో ఒకరోజున ఎవరో వచ్చి నరసన్నతో శ్రీరాములుగారిది గుంటూరుజిల్లా అని చెప్పేడు. నేనుకూడా ఆ సమయంలో అక్కడే ఉన్నాను.

సుత్తితో నెత్తిమీద కొట్టినట్టుగా కళ్లు తేలవేసి అలానే ఉండిపోయేడు నరసన్న. 'మదర్ సీరియస్, స్టార్ట్ ఇమీడియట్లీ' అనే టెలిగ్రాం చదివినవాడిలా ఉంది అతని ముఖం.

"అతన్ది గుంటూరు కాదయ్యా! నెల్లూరు, నాకు తెలుసు" అని నేను చెప్పినా, ఏడ్చే పిల్లణ్ణి ఓదార్చే కల్లబొల్లి మాటల్లా తీసుకొనేవాడు అతను నా మాటల్ని.

శ్రీరాములు గారిది గుంటూరేమోననే బెంగతో నరసన్న బరువుతగ్గి చిక్కిపోయేడు.

చివరకి పత్రికల్లో ఆయన జీవితం గురించి చదివి ఆయన నెల్లూరు జల్లావారనీ, మద్రాసులో పుట్టేరనీ తెలుసుకొని తేరుకున్నాడు నరసన్న.—

గుంటూరు పట్టణాన్ని ఆంధ్రరాష్ట్రపు ముఖ్యపట్టణంగా చేయాలని కొందరు, ప్రయత్నిస్తున్నారని వినగానే నరసన్న మండిపడ్డాడు.

కాని ఆఖరికి గుంటూరే రాజధాని అయిపోతుందేమోననే భయం అతణ్ని పీక్కుతినేసేది.

చివరికి ఓ రోజున భయం పట్టలేక "గుంటూరు కాపిటల్ కాకపోతే కనక మహాలక్ష్మికి కొబ్బరికాయ కొడతానయ్యా" అన్నాడు నాతో. అది నవ్వుతాలకి చెప్పిన మాట కాదు.

"విజయవాడైనా అవాలి, లేదా విశాఖపట్నమైనా అవాలి. గుంటూరు రాజధానిగా ఉంటే ప్రజలకు కలిగే ఇబ్బందులు" వగైరా అంశాల గురించి కనపడ్డ వాళ్ళందరితో టీ డిస్కస్ చేసేవాడు, లేని ధైర్యం తెచ్చుకొని. విశాఖపట్నంకాని విజయవాడకాని ముఖ్యపట్టణం కానందుకు విచారించినా, గుంటూరు కానందుకు సంతోషించినవారిలో నరసన్న ఒకడు.

ఆంధ్రులంతా గర్వింపదగిన పల్నాటి వీరులగురించి నరసన్నకి పెద్ద అభిప్రాయం లేదు. పల్నాటియుద్ధం గురించి ప్రసక్తి వస్తే చాలు నరసన్న "అబ్బే!" అని చప్పరించేస్తాడు.

"మన బొబ్బిలియుద్ధంపాటి ఎన్నడూ చెయ్యాదు" అంటాడు. ఆంధ్రరాష్ట్రోద్యమంలో రైయిన్లన్నీ ఆపడం గుంటూరు వారే ప్రారంభించినందుకు నరసన్న కొంత కష్టపడ్డాడు. కాని, అనకాపల్లిలోనూ, విశాఖపట్నంలోనూ, కాల్పులు జరగవలసినంత తీవ్రరూపంలో ఉద్యమం సాగినందుకు సంతోషిస్తాడు. పోలీసువారు అక్రమంగా కాల్చేరంటే వార్ని నిందించడం కూడా మర్చిపోతాడు నరసన్న.

"గుంటూర్లో టియర్ గ్యాస్ మాత్రం ప్రయోగించేరు. మరి మనఊళ్లో అంతటితో ఆగిందా?"

ఇది, ఇటువంటిది నరసన్న స్వభావం. అదొక రకం జబ్బని అతనికి తెలియదు. చాలామందికి తెలీదు. గుంటూరుకి సంబంధించిన విషయాల్లో అతని మనసు మార్చడానికి ప్రయత్నంచేసి ప్రయోజనం లేదు.

ఒక విషయంలో నేను ఎంత ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది.

బరంపురం అతని అత్తవారి ఊరు.

అతని భార్యకి కొంత అందం ఉంది. కొంత చదువుంది. ఆమె తండ్రికి బాగా డబ్బుంది.

అందం, చదువూ, డబ్బూ అటుంచగా ఆమె చాలా మంచిమనిషి. నాకు ఆమె కుటుంబాన్నంతా బాగా తెలుసు. ఆమె చిన్నతనంనుంచీ ఆమెని తెలుసు. వాళ్ళకి నరసన్న సంబంధం తీసుకువచ్చింది కూడా నేనే.

వాళ్ళకులంలో చదువుకున్నవారు తక్కువ. నరసన్నకి, పెర్సనాలిటీ లేకపోయినా, డబ్బులేకపోయినా, చదువుంది కదా అని పిల్లని ఇచ్చేరు వాళ్లు.

ఆ పెళ్ళికి ఓ విధంగా నేను కారకుణ్ని అవడంచేత నేను కూడా బాధపడవలసి వస్తోంది.

నరసన్నకి "గుంటూరు జబ్బు"- ఉందని నాకు అప్పట్లో తెలీదు. బరంపురం స్వస్థలంగా గల ఆపిల్లతండ్రి గుంటూరుజిల్లాలో కొంతకాలం పనిచేసేడని నేనంతగా గుర్తుంచుకోలేదు. గుంటూరు జిల్లా, గుంటూరు పట్నం నరసన్న భార్యయొక్క జన్మస్థలమని పెళ్ళి అయాక కొన్నాళ్ళకి తెలిసింది నరసన్నకీ నాకూ కూడా.

అంతవరకూ ఆమెని ఎంతో అభిమానంతో చూసుకు వస్తోన్న నరసన్న పైకి కక్కుతున్నాడు.

(౫౩-వ పేజీ చూడండి)

# గో[illegible]ని తెల[illegible]

సన్నని జీరలాంటి కాలిదారి కనకాపురం రోడ్డుని చీల్చుకొని, నారాయణ సింగు మాన్యంలోంచి, తాటితోపు పక్కనుంచి పాములా జరజరా పాకిపోతోంది. నారపరెడ్డి దుంగలాంటి మనిషి, ఆ కాలి దారినే బరువుగా అడుగుల్లో అడుగు లేసుకుంటూ ముందుకి సాగిపోతున్నాడు. జామి తోపులోంచి మళ్లుతోంటే, దూరంలో ఎవరో, గట్టుమీంచి పరుగెడుతున్నారు గడ్డిమోపు నెత్తినెత్తుకుని. ఆ మనిషి రెడ్డి కళ్ళని పడ్డంతోనే, రెడ్డి ఎలుగెత్తి, 'ఓరయో యో! ఎవరోసో!' అని కేక వేశాడు. ఖంగున మార్మోగుతోన్న శబ్దం, తాటితోపుని, జామితోటని ఢీకొని, ఎదురు జవాబిచ్చి, నిశ్శబ్దపు గుండెల్ని చీల్చేసి, పరారవుతోన్న మనిషి గుండెల్ని టివ్వు టివ్వున మోగించినయ్!

నారపరెడ్డిచూపుకి మనిషందలేదు. కిందకి తుప్పల్లోకి పుట్టల్లోకి, తుమ్మకొమ్మల నీడల్లోకి దాటుకుపోయింది.

'ఆసి దీని జిమ్మడ! ఎవరోత్తో ఎదవ సెంజ మోపెత్తుకు పోతంది - దీని అంతు కనుక్కోవాల-పాలికాపుది కాదుగందా!' — రెడ్డి ఇలా గుడ్డిగా ఆలోచన సాగించుకుంటూ, ఫకీరు పాకలు చేరుకొన్నాడు - ఫకీరు పాకలన్నీ అలగా జనం దరిద్రనివాసస్థలాలే!

గట్టుపతల్నుంచి, ఎలుగెడుతూ, 'హారేవ్! తెలుపులూ! తెలుపులూ! ఏజేత్తున్నావ్! పొద్దుటి మట్టుకి, పొలాని కెళ్ళవంటరా!' అని గద్దించాడు.

ఎడమపక్క ములగచెట్టు, అరటిచెట్లు కోసుగా వున్న రేకలో, పాకలోంచి, తెలుపులుగాడు బయటికొస్తూ, 'ఏంది బాబూ! పొద్దుణ్ణుంచి గంజినేదు బాబయ్యా, పొలాని కెలా గెల్లాలో మీరే సెప్పండి, కుంచెడు జీతంగింజలు కొలిసియ్యమనేతలికి, మా అసదాన్ని తన్ని తరిమేశారంట. మి మ్మల్ని కనిపెట్టుకునోళ్ళం... మీరు టువ్వడితే సత్తువుంది, పని సేత్తాంగానీ...'

నారపరెడ్డికి వళ్ళు మండిపోయింది. పొలంలో బండెడు పనులుంటే, గంజి లేదని, తెలుపులు సాకులాడుతున్నాడు. ఆకలి! ఆకలి! గంజి, గంజి — ఎంతసేపు ఏడ్చినా ఇవే మాటలు — ఒకరోజు గంజి లేకపోతే 'చచ్చిపోతారా? అన్నింటికీ ఓర్చుకుని, పనిచేసిననాడే, దేశం బాగుపడుతుంది. ఈ ముక్కల్నే, తెలుపులుగాడి చెవుల తెలుపులూడేట్టు మోగుతూ, తూర్పుగట్టుకి నాళం గొట్టాం బాగుచెయ్యాలని, వంతువస్తే, ఒక్క చుక్కన్నా నీరు పార్లిపోకండా మళ్ళన్నింటికీ పిరగాడి మడి దగ్గర్నుంచి నీరుపెట్టమని, పసువులకి మేతాగీతా వేసి, దమ్ముకి సిద్ధంగావుంచమని, లెక్కలేనన్ని పనులూ శాసించాడు.

అయితే తెలుపులు పాక కదిలి బయటికొస్తేనే!

నారపరెడ్డి వళ్లుమండి అరుస్తూ, "ఆరి గాడిద కొడకా! నీకు సెప్పిందేటి? సేసిందేంటి? నెలకి ఏడుం గింజలు కొలిచి, నీకు మేపుతా కూకోపెడ్డానికంట్రా! నీ నెత్తిమీద ఎంటికలన్ని పన్లెట్టుకుని, ఇంట్లో

**రమణశ్రీ**

కూకున్నా కంట్రా! ఇంకా అమావాసి, రాకండా వుండంగానే, ఏ మొగం పెట్టుకుని పంపించావురా నీ పెళ్ళాన్ని" —

తెలుపులు మొహం ముడుచుకున్నాడు. ఇంట్లో ముసలాడికి జబ్బు — మంచంమీన పడుకొని సతమతమైపోతున్నాడు. ఇంట్లో పిడికెడు గింజల్లేవు! నెలకి నారపరెడ్డి ఏడుంగింజలిస్తే 'వా తోనే గెంటుకు రావాలి! మరోవిధంగా, పన్నండేరోజులయితే, తాయారమ్మ కూలిపనికిపోయి, రూపాయి డబ్బులు పయిగా తెచ్చేది. దానితో రోజూ కక్కుర్తి లేకండా తినేవాళ్ళు — ఊడుపురోజులు, ఏడుపురోజులైవర్షాల్లేక జనం గిలగిల తన్నుకుంటున్నారు. వంతొస్తుందా? అంటే అదీ లేదు. ఒక నాళంలోంచైనేను, నీరుపారే సూచనల్లేవు. మబ్బులన్నీ తెల్లగా ఎండకాస్తున్నై.

శ్రావణ భాద్రపదాల మధ్య వర్షాలకాశ. పడ్డమే గాని, నవగ్రహకూటం, వర్షహర్షాల్ని పీల్చిపారేసినై! అందుకే తెలుపులుగాడికిన్ని పాట్లు! రెడ్డి పంట బాగా పండితేనే గాని, ఒక్కగింజ ఎడమ చేత్తోనైనా విదల్చడు. గూడెంలో వున్నవాళ్ళవళ్ళ సంగతైనా, అంతే! వర్షాలు కురుస్తేనే బిల్లాడుకుంటూ, నారేతలనీ, ఊడుపులుఅనీ, కాలవత్రవ్వనీ, అనేక పనుల్లోకి దూరుతోంటే, కడుపులు చల్లగా నిండుతయ్! డొక్కాడితేనే, ఊపిరి లోపలికెడుతుంది.

తెలుపులు, "ఏటి బాబా! మీరు తిడితే పడతాంగానండి! గంజి నేనప్పుడు ఏం సెయ్యమనేరు? ముసలోడికి, కూసిన్ని గంజినీళ్ళు సేవోరు నేరుగందా! సావమంటారా! సావమంటే సచ్చిపోతాం - పీడా ఇరగడైపోద్ది. మీరు గింజలూ ఇయ్యక, జీతాలు ఇయ్యక, మీమీ దాధాగ్రపడ్డోళ్ళం ఎట్టా బతుకుతాం మీరే సెప్పండి! గట్టిగా ఆకలేత్తందని గోలెడితే పోలీసోళ్ళ కప్పసెపుతామంటారా?"

రెడ్డి గుటకలు మింగుతూ, 'పొలంలోకి నడరా! ఎదవ్వేశా లెయ్యక' అంటూ ముందుకు సాగాడు. రెడ్డిచేతిలో సంచీలో, అన్నం పప్పూ, కూరలూ, ఎండిరేలుపులునూ సంజూడు బలే గుమ్మగా వుంటుంది. తెలుపులు నోరూరుతోంది. పొద్దుణ్ణుంచి, తనకి కడుపులో కాలిపోతోంది. రాత్రి కూడు కుమ్మాలేదు. పొట్టలో పేగు లరుస్తున్నై ఆకలి వేగన - మండిపోతోంది కడుపు. ఆగ లేకండా కొంతసేపుంటే జఠరాగ్ని పేగుల్ని వేస్తుందా? అన్నంత ఇదిగా తెలుపులు మండిపోతున్నాడు. రెడ్డి కడుపులో ప్రేగులు బరబరలాడుతున్నై. 'అజీర్ణంగా వుంటుందిరా' అన్నాడు రెడ్డి. రెడ్డి కజీర్ణం! తెలుపులుకి నమిలి మింగేసేటంత ఆకలి! ఇద్దరూ నడిచి, నడిచి నారాయణమ్మ గుడిదగ్గరి కొచ్చారు. మంచినీళ్ళ నుయ్యి దగ్గిర సంచి, కొమ్మకి తగిలించి, 'ఒరేయ్! సంచి సూత్తుండరా! ఇప్పుడే వత్తా'అంటూ చేదతో నీళ్లు తీసుకుని పక్క కెళ్లాడు.

గట్టుమీద తాటిచెట్లు హోరుమంటూ ఆవలిస్తున్నై! తాటిపళ్లు నల్లగా, ఎర్రగా మాలమాదిగ అలగాజనం కడుపు పంటవుగా కనిపిస్తున్నయ్!

"ఈ యేడు కరువొచ్చేట్టుంది" - గట్టిగా అనుకున్నాడు పైకి. "వత్తే రానీ[illegible]! అందరిలాగే మనం - సత్తేసత్తాం! బతికితే బతుకుతాం!"

అందరితో పాటే తనూ నారాయణ. తనకి ముసలోడు బతికున్నంత కాలం దండుగే లాభం ఏవుంది? తెచ్చింది కాస్తా అతనికే

జబ్బు నయం చేయించడానికే, అయిపోతోంది. ఆడు చచ్చినా బావుణ్ణు. చచ్చిపోతా డనుకునేసరికి, తలుపులు కళ్ళల్లో నీళ్ళు పారినై. తను తండ్రిలేనివాణ్ణయిపోతానసే దిగులేసింది.

ఇంతల్లోకే కొంప మునిగిపోయినట్టు, రెడ్డి పరుగెత్తుకుంటూ 'ఓరి నీ పెళ్ళాం పుస్తెలు తెగ! ఏంజేత్తున్నావ్‌రా! సంచేదిరా!'

సంచెక్కడుంది? నేలమీద పులుసుతో దొర్లుతోంది. భూపతనమైన ఆహారపదార్థాలన్నీ—మట్టితో కొట్టుమిట్టాడుతున్నై. వాటికోసం కుక్కపిల్లలు దెబ్బలాడుకుంటున్నై. 'ఈ కూడు నాకు నేష్టం నేదురా!'—అన్నాడు రెడ్డి.

"నూల్లేదు బాబయా, కొమ్మకి సివార కట్టినట్టున్నారు! జారి పడిపోనాది" తలుపులు సమాధానాన్ని వక్కరిస్తూ "ఇంటికి పోయి, నేను కూడుతి నేసి, వచ్చేతలికి గట్టు పూర్తిచేసి నాళం జాగ్రత్తగా బిగించి వుంచు" అని రెడ్డి వెళ్ళిపోయాడు. రెడ్డి అడుగులు గుడ్డిగా పడుతూండడం, చెరుకు తోట పక్క మడిలోకి వెళ్ళడం, తలుపులు కనుమాపుదాకా చూశాడు.

కుక్కపిల్లల్ని అదలించి, మట్టి గిట్టే దులిపి, ఎలాగో తంటాలుపడి, ఆ కూడు కొస్తా నంజుడుతో తిన్నాడు. అరాకలైనా, నిండా కడుపు పూర్తిగా నీళ్ళు తాగి, లేచేసరికి, సగం అన్నం అప్పుడే అరిగిపోయినట్టు—మళ్ళీ ఆకలేసింది, 'రెడ్డిగారి కజీర్ణం, నా కాకలి'—అని పెద్దపెట్టి నవ్వుతోంటే దూరంలో, తాయారమ్మ 'మధ్యాహ్నం గంప' నెత్తి నెత్తుకొని, వస్తోంది.

మిట్టమధ్యాహ్నపు ఎండ పొలాన్ని బాగా వేడెక్కిస్తోంది. ఆకుమళ్ళు పచ్చగా మిసమిసలాడుతూ, గాలికి మడి మడంతా పరిసమానంగా ఒయ్యారంగా వంగుతూ, పచ్చని నీటి అలల్లాగా, వంపులు సొంపులతో మెరుగు లీనుతున్నయ్! పార తీసుకుని గట్టెక్కబోతోంటే, తాయారమ్మ దూరంనుంచి, తుమ్మ గట్టెక్కడంతోనే నేలలో పార పారేసి—'మజ్జాన్నం గంప' కోసం ఎదురుచూస్తున్నాడు:

నూతిదగ్గర గంప దింపి, తలుపుల్ని పిలిచింది. తలుపులు, చేతులూ కాళ్ళూ కడిగి, గిన్నెలో చెద్యొట్టి కలుపుతూ, "ఏయే ఒయ్యారి వెక్కడియ్యే! నే నొచ్చేతలికి పిడకడు నేనే నేవు"—అన్నాడు.

"ఎవరితో అనమాక" అంటూ తాయారమ్మ చెవులో గుసగుసలాడింది.

తలుపులు కోపం నటిస్తూ, "ఆని నీయిల్లు



"పయిఖర్చుకి ఓ రూపాయి డబ్బులిప్పించండి బాబా" అంటూ వెంబడించింది తాయారమ్మ.

గూల! దొంగకూడేటే! రెడ్డికి తెలిత్తే మక్క లిరిసెయ్యడూ?"

"సత్తా వేటి? లేకపోతే నిన్నటునుంచి కూడు నేదు. సిన్నమాపు కట్టకెల్లి, బొర్రయ్యశెట్టి కిస్తే, నాలుగు సోడిగింజలు సుప్పెడు బియ్యం గింజలు ఇచ్చినోడు. ఆయ్యో ఇయ్యాల్టికి గంజయింది."

"ఆరు నూస్తే."

"నూణ్ణే! నూని సేసేదేవుంది? కడుపులో కాల్తంటే, ఏ పని సేసినా, తప్పు నేదనేవోడు మా బాబు!"

"మీబా బొంటి దొంగ—జేల్లో నేసచ్చేడు"

ప్రముఖ పత్రికా సంపాదకుడు ఒకాయన, ఒకరోజు హోటల్లో భోంచేస్తున్నాడు. పులుసులో అనేక రకాలైన గడ్డీ, చెత్తా ఆయనచేతికి తగిలాయి. ఆయనకి వొళ్లు మండుకుపోయి, ఆహోటల్ యజమానిని పిలిపించి "ఇందులో ఏమేమిటి వేశావో, అవన్నీ ఎక్కడ సంపాదించావో చెప్పు"మని అడిగాడు.

"మీ పత్రిక వాళ్లకి వున్నట్లే మాకు పాలసీలు వుంటాయండి. ఏ పదార్థంలో ఏమేమి వేసి చేశామో అదంతా బయటపెట్టం!" అన్నాడు ఆహోటల్ యజమాని.

# గొళ్లెంలేని తలుపులు 

తలుపులు అయోమయంలో పడ్డాడు. రెడ్డికి తెలీకుండా, గడ్డిమేటులో మోపు తీసుకెళ్లి అమ్ముకొచ్చింది. దాంతో ఆపూట వెళ్లించింది. రెడ్డి తనమీద నమ్మకంతో, బోలెడంత అయివేజుకి కాపలా పెట్టి ఆయనింటి దగ్గర పడుకోంటాడు. అతనికి తెలిస్తే, తన బతుకు బరువు పోతుంది. అయితే ఇంటిల్లిపాదీ ఎలా బతకాలి? రెడ్డి సెలయితేనే గాని, గింజలు కొలవడు! అయినా బకాయీలు మినహాయిస్తుంటాడు. ఈలోపులో తనూ, పిల్లామేకా, పెళ్ళాం ముసిలోడు, విధవప్పగారు పస్తులూ, పాషాణాలు!

ఆ కూడు నోట్లో పెట్టుకున్నంతసేపూ, ఏదో అన్యాయాన్ని, అధర్మాన్నీ కడుపులో ముద్దలు, ముద్దలుగా పెట్టుకుంటున్నట్టు, దొంగతిండి శరీరంలో కలుస్తున్నట్టు ఆవేదన పడ్డాడు.

* * *

"రోజూ తట్టా గట్టా నెత్తి పెట్టుకొని, కూలాని కొత్తే, ఎక్కడ తెమ్మంటావే! తేరగా వుందనుకున్నావేటి పాతర"— రెడ్డి పట్నంపోతూ, తాయారమ్మని గట్టిగా గిజాయిస్తూ మాట్లాడాడు.

"తవఁరే అలా అంటే ఎల్లా సెప్పండి బాబూ! ఏలినోరి పాదాలకాడ పడుండేవోళ్ళం! ఆ ముసిలోడికి నాడెం నేదండి— ఆజే మింగేత్తన్నాడు ఎంత ఎత్తు కల్లినా— జబ్బులో సావకు మమ్మల్ని సంపుతున్నాడు— ఏదో నేనే, ఆ పుల్లా పిడకా సేసుకుని పావల్డబ్బులు తెత్తే, ఆ పూట గంజెల్లి పోద్దండి..."

"ఏటే నీ సొద! ఊరడతంటే అపసకునం—" అని రెడ్డి, దీనికో కుంచెడు గింజలు కొలరా! సుబ్బారావు అంటూ కర్ర తీసి కిర్రు చెప్పులు కిరకిర లాడిస్తూ, సాగిపోతున్నాడు.

"పయి ఖరుచుకి ఓ రూపాయి డబ్బులిప్పించండి బాబా" అంటూ వెంబడించింది తాయారమ్మ.

"రూపా యెందుకే!"

"గుట్ట తవ్వి మట్టి తినందుక్కాలి బాబా"

"ఓహోఁ! ఎవ్వారం రూపాయికాడి కొచ్చిందేటి! గింజలు కొలమనేసరికి"

తాయారమ్మ ముసిముసి నవ్వులు నవ్వుతూ, రెడ్డికి అడ్డుగా నిలబడి చేతులు చాచింది. "దొరగారి దయ. ఏలినోర్ని కని పెట్టుకున్నవోళ్లం! ఆలించినా పాలించినా మీరేకదండీ"

నారపరెడ్డి తాయారమ్మ తారకానేత్రాల్లోకి, సుదీర్ఘంగా చూచాడు. తళతళ మెరుస్తో కాంతులు కురుస్తున్నయ్! ఎంత సంస్కారం లేకపోయినా అందం అందమే! కళ్ళల్లో లోతుల్లో లోయల్లో వెలుగులు ప్రసరిస్తూ, నవ్వును మరింత బలంగా అందా జమకడుతూ, విరిసిన పువ్వులా ఆకర్షిస్తోంది తాయారమ్మ. ఇరవైదాటినా బిగుస్తోన్న యౌవనపు జిగిబిగి, రెడ్డిగుండెల్ని అటాటుగా నొక్కుతోంది. మాలకొంపల్లో నలిగిపోతోందిగాని రెడ్ల లోగిళ్ళలోనో, కమ్మభవంతుల్లోనో పుట్టివుంటే తాయారమ్మ తారుణ్యం... తారాపథాన్నంటుకుంటుంది.

తాయారమ్మ చిరిగిన రవికలోంచి, చంకలకింద, భుజాలమీద స్పష్టంగా చూస్తూ, "గుడ్డలేవేటి? సెతులకే ముక్కుకి మోపోళ్లెట్టిన సొమ్ములేవయ్యాయే—"

ఆదరంగా అడుగుతోన్న రెడ్డిని చూచి సిగ్గుపడుతో, "రవికమానికేసి కుట్టినా మళ్లీ సినిగిందండి! ముక్కెర, సెవులకమ్మలూ ముసిలోడి వచ్చుబోతంలో హారించుకుపోనాయ్! కూడుకే రోజుగడవటం నేదంటే, గుడ్డలేటొత్తయ్! పొంగోడికి గోసీయే గాని, పంచలన్నీ సిరిగిపోనాయ్! మా దరిద్రం ఓనాటితో తీరేదికాదులెండి"— కళ్ళనీళ్లు గుక్కుతూ అంది.

"అదిగాదుగాని, గడ్డిమేటు జాగ్రత్తని చెప్పు!—రోజురోజుకూ తరిగి పోతంది— ఏవన్నా అమ్మకు దొబ్బడం లేదుకదా!" రెడ్డి, నడ్డిమీద చెయ్యేసుకొని, గద్దించి అడిగారు.

"రావఁ రావఁ! పసులుకాడి తిండి సుంకాజేత్తే, దేవుడు మాకూడు పడగొడతాడు బాబయ్యా! రూపాయిప్పించండి"

తోలు సంచీలోంచి, రూపాయితీసి తాయారమ్మ మొగానేసి కొట్టాడు.

గింజలవీ కొలిపించుకుని తాయారమ్మ గుడిసెలోకొచ్చింది. తలుపులు తండ్రి మంచంమీంచి లేస్తూ, "పొద్దుననగా పోయినదాని విప్పుడంటేరాటం? ఏటయింది?"

"గింజలూ, రూపాయి తలుపులుముందడుతూ, "సచ్చి సచ్చి, సోకన్నారెడితే ఇయ్యిచ్చాడు - ఆడి జిమ్మడ! ఎప్పుడు మన మీదే నూపు - మళ్ళీ గడ్డివాం తరిగిపోతందట జాగ్రత్తగా నూడు."

తలుపులు విషమపూరితంగా నవ్వుతూ, "రెడ్డి గుడ్డిముండాకొడుకు"

"అలాగనుకుంటూ కూకో! నానీసవుష్టు నెప్పుడీసుకు తంతాడు లబోదిబోమందువ్ గాని"

"నీవు సెప్పిందే గదంటే".

మంచంలోంచి, వింటూన్న తలుపులు తండ్రి నోరు విప్పి, "ఏం పత్రా అది

తన్నింటి వోసాలు రెక్కాడ తన్నా తింటరా! రెడ్డోరు మంచోరు గనక సరిపో యింది. నేయంగా తిన్న కూడు అరుగుద్ది గాని..."

"నువ్వు కూ నేయంగా బతికేవు, ఇదొర కటి రోజులేటయ్యా! జీతాలు నాతాలు ఇయ్యక, పన్లూ లేకపోతే సచ్చిపోతావా? కడుపు కాలతంటే, కరువొచ్చి సత్తంటే, పేగులు మాడ్చుకొని నిజాయితీగా బతకా లంటే నీకులాగే సావాలి! మాసేత గాదు!"

తండ్రి వగురుస్తూ మంచంమీదే వెల్లకి తలా పడుకున్నాడు.

"సచ్చేవోడివి నువ్వు గాని నేనేటి?"— తలుపులు మంచం దిగి, పొయ్యిదగ్గిర కెళ్ళి చుట్ట కాలుస్తుంటే, తాయారమ్మ "ఏదో వుత్తి సేసుకు బతక్కపోతే సచ్చిపోతా మేటి. ఏదీ నేనపుడు దొంగోల్ల మవుతాం" అంది.

తలుపులు వికవికలాడుతూ వెగటుగా నవ్వాడు.

* * *

పంటలమీద రైతులంతా ఆశలొదులు కొన్నారు. ఉత్తర హస్త చిత్తకార్తులన్నీ ఎండలు మండించుకుంటూ సాగాయి. మేఘాల్లో ఒక్క వర్షపు చుక్కన్నా లేనట్టు ఋజువయింది. వచ్చిన ప్రతి మేఘమూ, ముఖాలు వేలాడేసిన రైతుల్ని చూస్తూ, ఒక్క కన్నీటి బిందువన్నా రాల్చలేదు—

రెడ్డి పొలమంతా నెరియలు కట్టి బీడుగా గోడుగా మాడిన ముఖంతో, రెడ్డి ఐశ్వర్య రాహిత్యాన్ని మరింత అవహేళన చేస్తోంది. పొలానికి, నడిబొడ్డులో వున్న చెరకుతోట, గడ్డిమేట్లు గుడ్డి వెన్నెల్లో తల విరబోసుకుని రాక్షసులుగా కనిపించ సాగినై! నీరు లేని తోట, బీలకర్రలు వేసింది. సగానికి సగం చచ్చింది. దిక్కు తోచని రెడ్డికి, పక్కలో పోటులా పాలి కాపులు తగులుకుంటున్నారు. పాతర తీసి గింజ లివ్వడానికి రెడ్డికి ప్రాణాలు రావటంలేదు. బస్తా నలభైదాకా అమ్మ దావనే ఆశతో నిలవేసి వుంచాడు.

తలుపులితో ఖచ్చితంగా చెప్పేశాడు గింజల్లేవని. అడిగినా లేవని—తన తిండికే కొనుక్కోవాలని—కావాలంటే రూపా యిలే ఇస్తానని—

తలుపులు నెత్తీ నోరూ మొత్తుకుంటూ, "రూపాయిలిస్తే ఏంచేసుకోం బాబయ్యా! కూరుకు తాగమంటారా!" అంటే, "సోల్లూ, సజ్జలు కొనుక్కు తగలడండి తెలగపిండి తిని బతకండి సావండి నా కెందుకూ? పంటల్లేందే గింజ లేమొగం పెట్టుకొచ్చావ్"—

"నిరుడు పాతరంది కాదు బాబయా, తీయించరేటి అయ్యా ఇప్పించండి"—

"ఓరి నీయమ్మ కడుపు కాల! పాతర సంగతి నీకెందుకురా! పాతరలోయి, పుచ్చి పోయాయ్! తగలడ్డయ్! పాత రెయ్య డం అంత బాగా తగలడ్డారు." అన్నాడు రెడ్డి—

కుంచం రూపాయికి విలవకట్టి డబ్బు ఇరవై ఇచ్చేశేనాడు. తను బస్తా ముప్పై ఎనిమిదికి అమ్ముకున్నాడు.

"ఇదే మన్నాయ్యమయ్యా" అంటే "నోర్మూసుకోరా! డబ్బుమాత్రం మొక్క లేడిసింది? రూపాయిన్న రొడ్డీ అన్నా పుట్టటం లేదే" అని కన్నీళ్ళు తుడి చాడు.

తలుపులు కన్నీళ్ళు తుడుచుకొని, తాయారమ్మ సహాయంతో ఆకలేసినప్పు డల్లా గడ్డి తింటున్నాడు!

"ఏరా ఏరోవతంనాటి గడ్డిమేటు రోజు రోజుకీ పీనుగైపోతం డేటిరోయ్! ఏతన్నా

# వేషంవల్ల వచ్చిన దోషం

శ్రీ అయ్యగారి వెంకటసుబ్బారావు

ఆరోజు పరీక్షాఫలితాలు ప్రకటిస్తారని పుకార్లు వదంతి బయలు దేరింది. రావిచెట్టుక్రింద పెద్దమనుష్యుల లగాయతు, నీలాటిరేవు దాకా ప్రాకింది వార్త. ఆ వార్త మెల్లిగా మా యింటికి కూడా చేరింది. మా అమ్మ ఈమాట వినగానే దేముళ్ళకి, దెయ్యాలకి వరసపెట్టి దండకం చదివినట్టు, మొక్కులు మొక్కేస్తోంది. మా అమ్మకి మా ఆచారాలమీద నమ్మకెక్కువ. మనం గట్టిగా చదివి, బాగా వ్రాసినవాడు దేముడికి మొక్కినా ఫలిస్తుంది కాని, శుద్ధ తెల్ల కాగితం యిచ్చి దేవుడా నీదయ అంటే అయనేం చేస్తాడు? మానవయత్నాన్ని పూర్తిచేసి దైవయత్నంకోసం ప్రాకులాడాలికాని, పొయ్యిమీద ఎసరు పెట్టకుండా దేముడా నీదయ అంటే, భోజనం ఎక్కడనుంచి వస్తుంది?

మానాన్నగారు భోజనాలదగ్గర పరామర్శింపు. “ఏరా! పొరపాటునైనా వాడు నీ నెంబరు వేస్తాడా?” అని. ఏమో ఎవరు చెప్పగలరు? సంవత్సరం పొడుగునా కష్టపడి చదివాం అనుకున్నవి వచ్చాయి. జాగ్రత్తగా తెల్లకాగితాలన్నీ నల్లకాగితాలుగా మార్చాం. మరి ప్యాసౌతానో లేదో నాకే తెలియకచస్తూంటే మధ్యన వీళ్ళేమిటి? అనుకున్నా.

మానాన్నగారు అందరికన్నా ముందు భోంచేసి వెళ్ళిపోయారు. నా భోజనమింకా తెమలలేదు. ఆలోచిస్తూ తింటున్నా. అసలు ప్యాసౌతానా లేదా? ఒకవేళ ప్యాసైతే ఏమిటి చెయ్యడం? కాలేజీలో చేరడమా? లేక ఏగుమస్తా పనైనా చూసుకోడమా? బుఱ్ఱలో అనేక ఆలోచనలు గిఱ్ఱున తిరుగుతున్నాయ్. యింతలోకే మానాన్నగారొక కేక పెట్టారు. “నీ నెంబరెంతరా” అని. నాకు గుండె ఆగినంతపనైంది. నోటమాట పెగల్లేదు, ముచ్చెమటలూ పోసినై. ఎల్లాగోలాగ “గోడమీద వుంది” అనగల్గాను మహాప్రయత్నంమీద. చెయ్యికడుక్కొని బయటికివచ్చాను. మానాన్నగారు కళ్ళద్దాలనైనా సరిగా పెట్టుకోకుండా పేపరంతా నా నెంబరుకోసం కలయచూస్తున్నారు. నేను నాన్నగారి దగ్గరకు వెళ్ళాను. నాకసలు నెంబర్లు కనిపించటల్లేదు.

పేపరంతా పచ్చగా కనిపిస్తోంది-ఒక్క అక్షరంకూడా కనిపించక కళ్ళు పెద్దవిచేసుకొని చూస్తున్నా. యింతలోకే వీపుమీద ఒక్క చఱుపుతోటి కళ్ళపొర వీడింది. “పాసయ్యావురా” అన్నారు నాన్న. నా కళ్ళు జలదరించింది. ఆనందోత్సాహంతో అమ్మదగ్గరకు ఒక్కగంతులో వెళ్ళాను. అమ్మ పొయ్యదగ్గర కూర్చొని గారెలు వండుతోంది.

“అమ్మా!.. నే ప్యాసైనానే” అన్నాను. సంతోషంతో...అమ్మ యధాప్రకారంగా దండకం చదివి ‘మొక్కులు తీర్చుకుంటా నాయనా’ అని చెంపలు బాదుకొని, ఒక అరడజను గారెలు నాముందు పెట్టింది “తినరా బాబూ...తిను” అంటూ అప్యాయంగా.

సాయంత్రం నాల్గుగంటలకి చల్లగాలికని ఇస్త్రీబట్టలు వేసుకొని పరీక్ష ప్యాసైనానన్న విజయగర్వంతో రోడ్డువెంట నడుస్తూండగా పాత స్నేహితులంతా చుట్టూ మూగారు. ఒకరి తరువాత ఒకరు విరామం లేకుండా కంగ్రాచ్యులేషన్స్ తెల్పారు. యింతలోకే ఒకమూలనుంచి “అన్ని కంగ్రాచ్యులేషన్స్ అయితే వాడికి అజీర్తిచేస్తుంది. నాకో రెండు పడెయ్యండిరా” అన్నది ఒక పరిచిత కంఠం. అందరి మొహాలు ఒక్కసారి అటు తిరిగాయి. పాపం!! పరీక్ష తప్పిన పాపారావు. మూడో ఏడుకూడా విద్యాశాఖాధికారికి వాడిమీద దయగల్గలేదు కాబోలు. వాడిని ప్యాసుచెయ్యలేదు. పాపారావుని ఓదారుస్తూ, వాడి పరీక్ష పోయినందుకు మావాళ్ళంతా సానుభూతి తెల్పారు. అంతా కొంతసేపు పరీక్షాఫలితాలమీద చర్చించాము. పరీక్ష పోయినవాళ్ళంతా సెకండు లిస్టు వస్తుందని ఆశిస్తున్నామన్నారు. ప్యాసైనవాళ్ళంతా వారిమాటను కొట్టేసి సెకండులిస్టు రాదని వాదించారు. ఏది ఏలావున్నా నేను ప్యాసైనానన్న ధీమాతో, విజయగర్వంతో వారు చర్చించే ప్రతి అంశాన్ని ఖండిస్తూ, దాన్ని సమర్థించుకుంటూ, వారందరికన్నా నాదే పైచెయ్యి అనిపించుకున్నా! పరీక్షాఫలితాలతో ప్రారంభమైన మా చర్చ, నేటి సినిమా యుగందాకా చర్చించి, ఆ తరువాత క్రొత్త సినిమాలమీద కొచ్చింది. స్నేహితులంతా సినిమాకి రమ్మని బలవంతపెట్టారు. కాని నేను వెళ్ళలేదు. వాళ్ళంతా నన్ను వదిలిన అనంతరం, మెల్లిగా యింటికి తిరుగుముఖం పట్టాను. ఇంటిదగ్గరకు వచ్చానో లేదో యింట్లో ఏదో పెద్దగా మాట్లాడుకుంటున్నారు. ఏమిటా అని గోడప్రక్కన నిల్చొని వింటున్నా.

“వీల్లేదు ఏమైనాసరే వాడిని కాలేజీలో జేర్పించాల్సిందే” అంది అమ్మ.

“ఎక్కడ చావనే - ఎక్కడనుంచి తీసుకురాను డబ్బు - వెనకాలేమైనా ఎకరాలున్నాయా తెగనమ్మి పుత్రుడిని చదివించటానికి” అన్నారు నాన్న.

“చదువుకొనే వాళ్ళందరికీ ఎకరాలున్నాయేమిటి? ఏదో స్కాలరు షిప్పో ఏదో యిస్తారుగా”

“ఈమాట నీకెవరు చెప్పారు?”

“పక్కింటి పరంధామయ్యగారి భార్య చెప్పింది. వాళ్ళబ్బాయి అలాగే చదివి బి. ఏ. ప్యాసైనాడుట”

“సరే...వాళ్ళకీ మనకీ సాటా! వాళ్ళు ఆ స్కాలరు షిప్పుకోసం ఎంత డబ్బుఖర్చు పెట్టేరో నీకు తెలుసా?

“మనసుంటే మార్గం వుంటుంది. అసలు మీకు చదివించాలని లేదు అంతేగా...”

“నీ ధోరణి నీదేకాని, నామాట వినిపించుకోవు. తాహతుకు మించిన పనులుచేస్తే

# ★ వేషంవల్ల వచ్చిన దోషం ★

ఈ బ్రతుకుకూడా బ్రతకడం కష్టమే"

"మీయిష్టం...మీయిష్టం మెచ్చినట్లు చెయ్యండి నాకెందుకీ గొంతు ..ఏ మాట చెప్పినా ఈమనిషితోయింతే" అంటూ మా అమ్మ అక్కడనుంచి లేచి వెళ్లిపోయింది. నాన్నగారు ఒక వేడి నిట్టూర్పు విడచి, "ఉస్" అనుకుంటూ నాదగ్గర కొచ్చారు.

"ఏరా! నీవుద్దేశమేమిటి" అన్నారు నన్ను చూసి. ఆ ప్రశ్న నన్నెందుకడిగారో నా కర్థంగాలేదు. దేనికి నా వుద్దేశ్యం? ఏ విషయంలో నావుద్దేశ్యం తెల్పాలో నా కర్థంగాక ఆయనమొహంలోకి ప్రశ్నార్థకంగా చూశాను.

"అది కాదురా కాలేజీలో చేర్తావా? లేక వుద్యోగమేదైనా చూసుకుంటావా" అన్నారు.

"మీయిష్టం" అన్నాను, భారమంతా ఆయనమీద వేస్తూ. అంతటితో ఆసంఘర్షణ ఆగిపోయింది. మా నాన్నగారు ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపోయారు. మా అమ్మ భోజనానికి రమ్మని పిలిచింది. భోజనాల వద్ద మా అమ్మ, నాన్న మూగవాళ్లలా వూరుకొన్నారు. అమ్మకుకోపం వచ్చిందని గ్రహించాను. ఇందాకటి సంభాషణ గుర్తుకొచ్చింది.

ఒక్కసారి ఒళ్ళు పులకరించింది. ఇంత బాధ, యింత కోపం, మా అమ్మకు నేను వ్యాసపటంమూలాన కల్గినందుకు నాకు కూడా బాధనిపించింది. ఆ సమయంలో బాధకల్గినా ఏమీ మాట్లాడకుండా బయటికి వచ్చాను. మా నాన్నగారుకూడా బయట చల్లగాలిలో కుర్చీవేసుకొని పడుకొని దీర్ఘాలోచనలో పడిపోయారు.

ఈ సెధవ పరీక్షాఫలితాలు ఈవాళ రాకపోయినా బావుండేదేమో! యింట్లో యిన్ని కలతలు, యింత తుఫాను లేపిన నా పరీక్షాఫలితాన్ని తెగతిట్టుకున్నా - మా అమ్మతో ఎందుకీ తగాదా కోపం, అని అడుగుదామనుకున్నా కాని అడగలేకపోయాను. నాన్నగారితో మాట్లాడితే చీవాట్లు. ఇంట్లో కలతలేకుండా చెయ్యాలని నా అభిప్రాయం.

తెల్లవారింది. వాతావరణంలో ఏమార్పూ కనుపించలేదు. ఇంట్లో కార్యక్రమాలన్నీ మూగసంజ్ఞలతోనే సాగిపోతున్నాయి. ఈ మూగసంజ్ఞలు ఎంతకాలమో? నా కర్థంగాలేదు. కాఫీత్రాగి బయటికి వచ్చాను. ఏం చెయ్యాలో అగమ్యగోచరం - స్నేహితులు, అమ్మ అందరూ కలిసి స్కాలరుషిప్పుకి అప్లై చెయ్యమంటున్నారు. అప్లై చేసినంతమాత్రాన అది వస్తుందా అని నేను. నాన్నగారు చెప్పింది సమంజసంగానే వుంది. ఆయన ఒక చిన్న గుమాస్తా. గవర్నమెంటువారిచ్చిన డిగ్రీ లోయర్ డివిజన్ క్లార్కు. ఇంత హోదాగల వ్యక్తియొక్క జీవితం ఎలా వుంటుందో, సంసారం ఎలా వుంటుందో నేను వ్రాయాలా! అందుచేత నాన్నగారు నెరవేరని ఆశలకోసం ప్రాకులాడితే నిరాశమాత్రమే మనకి మిగులుతుంది. అని అంటూండేవారు.

కాని అమ్మ వుద్దేశ్యం వేరు. వూరికే చదువు చెప్పించే స్కాలరుషిప్పుండగా మనవాడు ఎందుకు చదవకూడదు. అనే వితండవాది ఆవిడ. కాని స్కాలరుషిప్పు సంపాదించటానికి ఎంత రికమెండేషన్ కావాలో ఎంతమందిదగ్గర చేతులు నలపాలో, ఎంతమందికి డబ్బు యివ్వాలో నాలుగుగోడలమధ్య కూర్చొని మాట్లాడే మా అమ్మకేం తెలుసు - ఆవిడ దేముళ్ళకి చెయ్యాలికి మొక్కులు మొక్కుతుంది. ఈవిధంగా యింట్లో ఒకరి వుద్దేశ్యాలతో ఒకరు ఏకీభవించకుండా, ఎవరికివారు స్వతంత్రభావాలతో వుంటున్నారు.

ఒకరోజున మా అమ్మ గబగబా నాదగ్గర కొచ్చి,

"ఈ బుష్‌కోటు, ఈలాగు ఏలావున్నాయిరా?" అంది. ఆ దుస్తులకి మా అమ్మ కనీసం లేదంటే మూడుపదులు తగలేసి వుంటుందని బుర్రలో ఎస్టిమేట్ చేశాను. ఇంత డబ్బు ఖర్చుపెట్టి అమ్మ నాకు ఎందుకింత విలువైన దుస్తులు కుట్టించిందో నాకర్థంగాలేదు.

"యిప్పుడెందుకమ్మా యివి" అన్నాను. కొంచెం నిరసనగా.

"అదేమిటిరా అలా అంటావు. రేపు కాలేజీకి వెళ్లేటప్పుడు కొత్త మంచిబట్టలు కట్టుకోకపోతే ఎలాగ?" అంది.

అమ్మ నాకు తలంటిపోసి కొత్తబట్టలు కట్టుకోమని బలవంతంపెట్టింది. క్రొత్త బట్టలు కట్టుకొన్నాను. నాన్నగారికి నమస్కరించి రారా అంది అమ్మ. నాన్నగారి దగ్గరకు వెళ్ళి నమస్కరించాను. ఆయన నన్ను ఆపాదమస్తకం పరికించి మొహం చిట్లించుకున్నారు అమ్మ నాదగ్గరకొచ్చి అయిదురూపాయలనోటు యిచ్చి కాలేజీకి వెళ్ళి అప్లికేషన్ ఫారము యిచ్చిరమ్మంది. అయిదురూపాయలు జేబులో పెట్టుకొని ఒక్క అడుగు వేశానో లేదో "ఆఛ్" ఒక్క తుమ్ము. ఇదేమి అపశకునంరా భగవంతుడా అనుకుంటూ బయలుదేరి వెళ్లాను.

అదంతా కొత్త వాతావరణం. అడుగు వేసినా అడుగు కదిపినా, ఏమౌతుందో భయం. ఎవరు ఎక్కడ వుంటారో తెలియని స్థలం. బుర్రగోక్కుంటూ మర్రిచెట్టునీడని నిల్చొని కాలేజీ భవనాలనీ, పరిసర ప్రాంతాలలో పూలతోటనీ పరికిస్తూ అక్కడ నిల్చొన్నా. యింతలో ఒక కుర్రాడు,

"అగ్గిపెట్టె వుందాండి" అన్నాడు.

"లేదండీ, నాకు సిగరెట్లలవాటులేదండీ" అన్నా సంభాషణపెంచి అతనిద్వారా కాలేజీ ఆనుపానులు తెలుసుకుందామని.

"నిజంగా అదృష్టవంతులండీ మీరు. మీరేం చదువుతున్నారు?" అన్నాడు.

"కొత్తగా కాలేజీలో చేరదామని వచ్చా నండీ. ప్రిన్సిపాలుగారి ఆఫీసు ఏదండీ."

"ఆ ఎదురుగానున్న మేడ పైగదిలో వుంటారు కలుసుకొంటారా."

"మరేనండి. కలుసుకొని అప్లికేషన్ యిద్దామని. వస్తాను థాంక్స్" అని ప్రిన్సిపాలుగారి గదిదగ్గరకు వెళ్ళదామని మేడ మెట్లు ఎక్కుతున్నా. ఎదురుగుండా రక్షకభటుడు గుమ్మంకాస్తూ నన్ను అటకాయించాడు.

"ప్రిన్సిపాలుగారున్నారా?" అన్నాను.

"వున్నారు. అర్జంటు కాగితాలు మాస్తున్నారు. ఒక్క గంట ఆగాలి. మళ్లీ రండి" అన్నాడు బంట్రోతు. ఈ జాతి మనుష్యులని ఎలా వల్లో వేసుకోవాలో మామేష్టారు ఒకసారి చెప్పారు. నాకు తెలియకుండానే నా చేయి జేబులోకి వెళ్ళి ఒక కాగితంతో బయటికి వచ్చి బంట్రోతు చేతితో కలిసింది. వాడు అది చూసి, మందహాస వదనంతో, నాకేసి చూసి "వుండండీ లోపలికి వెళ్ళి అయ్యగారేమి చేస్తున్నారో చూసివస్తా" నంటూ లోపలికి వెళ్లాడు. ఎంత నిగ్రహశక్తిగల మానవుడైనా డబ్బుకి దాసానుదాసుడు గదా! అని అనుకుంటూండగా బంట్రోతు వచ్చాడు.

"అయ్యగారు ఖాళీగా వున్నారు. ఇదే సమయం మీ పని అయిపోతుంది. తొందరగా వెళ్ళండి" అన్నాడు. నేను కంగారుగా లోపలికి వెళ్లి, వినయపూర్వకంగా ఒక నమస్కార బాణం విసిరేశాను. ఆయన మాట్లాడకుండా కళ్ళజోడు తీసి ప్రశ్నార్థకంగా నాకేసి చూశాడు. జవాబుగా నా కాగితం ఆయన ముందు పెట్టాను. ఆయన ఆ కాగితాన్ని తిరగా బోర్లావేసి, నావంక అదోమాదిరిగా తేరిపార చూశాడు. ఆయన నోటివెంట ఎటువంటిమాట బయటికివస్తుందో నని చెవులు రిక్కించుకొని వింటున్నాను. ఆయన "సరే వెళ్ళు" అన్నాడు.

"నేను. . . ." ఏదో అనబోయాను.

"సరే వెళ్ళవయ్యా చూస్తాం" అని కొంత విసుగ్గా అన్నాడు. నేను మళ్ళీ మాట్లాడకుండా, యింటికి తిరుగుమొహం పట్టాను. యిల్లు చేరుకున్నానో లేదో అమ్మ ఆత్రంతో "ఏరా, ఏమైంది" అని అడిగింది.

"చూస్తామన్నారే" అన్నాను.

"అంటే?" అంది అమ్మ.

"అంటే ఏమిటే చూస్తానంటే చూడ్డమే" అన్నాను. ఇంతలో నాన్నగారు తైపు వేసిన ఒక అప్లికేషన్ ఫారమ్‌తో నాదగ్గర కొచ్చారు. "దీని మీద సంతకం పెట్టు" అన్నారు నాన్న ఆజ్ఞాపూర్వకంగా. నేను అప్లికేషన్ శ్రీరామ మొదలు -చి తగించవలెనుదాకా చదివి సంతకం పెట్టి నాన్నగారి కిచ్చాను. నాన్నగారు ఆ కాగితం తీసుకొని కంగారుగా వెళ్ళిపోయారు. నాన్నగారు వెళ్ళిపోయేదాకా చూసి అమ్మ నాకేసి తిరిగి,

(54 వ పేజీ చూడండి)

# చైతన్యం

"విూకిచ్చిన ఐదురూపాయల్లోనూ, ఇంకా ఎంత మిగిలిందండీ."

అతను మాట్లాడకుండానే గాగుల్స్ తీసి అలమారులో పెట్టేడు. బొత్తాములు విప్పుకున్నాడు.

"నూనె అయిపోయింది. కూరలు కొనాలి. కాఫీ పొడుం రేప్పొద్దున్నకే వస్తుంది..." అవిడ ఆగలేదు.

జేబులోంచి చిల్లర డబ్బులు, సిగరెట్టు పెట్టె, అగ్గిపెట్టె బల్లమీద పెట్టేడు. అవిడ ఖంగారుగానే వస్తు డబ్బు లెక్కపెట్టింది. పదమూడణాలన్నర ఉంది. కొంచెం అనుమానం వస్తే అయన పంట్లాం 'బేక్ పోకెట్'లో చూచి, 'నిన్న నిచ్చేను అప్పుడే అంత ఖర్చయిపోయిందా?'

అతను మాట్లాడకనే, తువ్వాలు భుజం మీద వేసుకుని సబ్బుబిళ్ళపెట్టె వెతుకులాడేడు.

"కుళాయిదగ్గర ఎవరైనా ఉన్నారేమో చూస్తావా?" అనిమాత్రం అన్నాడు. ఎంచేతనంటే వచ్చే మూడు ఘంటలన్నరలోనూ, నాల్గుఘంటలు ఇంటివారి కోడళ్ళు, మనుమళ్ళు జలకాలాడుతూ ఉంటారు కనుక.

"పదిహేను ఘంటల్లో నాల్గు రూపాయిలు విూ ఖర్చుల క్రింద వినియోగిస్తే సంసారం ఎల్లా నడుస్తుం దనుకున్నారు? ఇంకా జీతాలొచ్చే రోజుకు పదిరోజులుందని తెలుసుకదా? ఇల్లా స్నేహితులకు, సిగరెట్లకు, కాఫీ హోటళ్ళకు తగలేస్తే ఎల్లాగ?..."

"రమణమ్మ నువ్వాళ్ళ చూచిరా అమ్మా, నల్లాదగ్గరకు వెళ్ళివచ్చే లేదో" అన్నాడు. అంటున్నప్పుడు కంఠం రుద్ధపోయింది; అవ్యాజమైన అనురాగంలో. ఐదేళ్ళ అమ్మాయి, వచ్చీ రాని మాటల్తో కబుర్లు చెపుతుంటే, తన ఆఫీసులో పడ్డ చివాట్లు, ఎండల్లో మాడిన శరీరం, ఇంట్లో భార్య పురాణ శ్రవణాలు అన్నీ కూడా మర్చిపోయేవాడు. అనునయం ఒక్కటే అమ్మాయి దగ్గర పొందినట్లుగా.

"ఇంతవరకూ నా డబ్బులోది పదిహేను రూపాయిలు ఇచ్చేను. ఇంక నాదగ్గర ఏమీ లేదు. రేపు కాఫీ పొడుం అర పౌను, నూనె ఈ పదిరోజులూ ఓ సవా సేరు కావాలి. నాకేం సంబంధం లేదు. బుర్ర వేడెక్కిపోతోంది ఈ వ్యవహారాల్తో" అంది.

నెమ్మదిగానే "నువ్వు నీళ్ళు పోసుకున్నావా?" అన్నాడు.

మాట్లాడనేలేదు అవిడ.

రమణమ్మ వచ్చి "చిన్నాయన స్నానం చేస్తున్నా"డంది.

"రమణమ్మా! ప్రొద్దున్న మా ఇంటికి రాలేదేం కాఫీ త్రాగడానికి? తమ్ముడు ఏం చేస్తున్నాడు? తమ్ముడికి మామిడిపండు పెట్టేవా?..." ఆ వరసలో ప్రశ్నలు వేసేరు. అమ్మాయి జవాబులు చెప్పింది.

## శ్రీ కందుకూరి లింగరాజు

వంటింట్లో గిన్నెల చప్పుడు మధ్య "ఇల్లా అయితే సంసారం నెగ్గినట్టే. నేను చెయ్యలేను. మావూరు వెళ్ళిపోతే కొన్నాళ్ళయినా మనశ్శాంతి వుంటుంది..." వినిపిస్తూనే వున్నాయి.

దానిమ్మ చెట్టుక్రింద నుంచుంటే పువ్వులు కనిపించేయి. 'అనర్కలీ'ని అమరంగా చేసి మొగలాయీ చక్రవర్తులు, ఆదర్శాలయ్యేరు. ప్రేమచిహ్నం అని ప్రపంచాన్ని ఉర్రూత లూగించేరు; ఈ నాటికి...

ప్రేమించే పెళ్ళి చేసుకోవాలి అనుకున్న దినాలు జ్ఞాపకంవచ్చి, కళ్ళమ్మట నీళ్ళు తిరిగేయి ఈనాటి స్థితి చూస్తే. ఆనాడే కాదు అప్పటినుండీ తను దిగజారేడు; ఆశయాల్ని అమల్లో పెట్టుకోలేక, కన్నవాళ్లకు కట్టుబడి.

ఈ ఐదేళ్ళ సంసారంలోనూ, తను ప్రేమించగల్గుతున్నా ననుకున్నాడు. అనురాగంకోసం, ఆదర్శంకోసం, తనెంతో త్యాగం చేసేడు. అభిమానం చంపుకున్నాడు. దాసోహం అన్నాడు కూడాను. అయినా తను ఊహించి, నిర్మించుకున్న ఆశాసౌధాలు తమ్మయిపోయి, ఊసరవిల్లులైయ్యేయి.

ఇంక భావిలో తను పునర్జన్మ పొందుతాననుకోవడం కూడా వట్టి హాస్యాస్పదంగా ఉండిపోయింది. ఆశ లేదు. ఆదర్శాలన్నీ సినీమాల్లో చూచే గ్లేమర్లాగే ఉండిపోయేయి. ఓ నైతికపతనం. ఈ బానిసత్వంలో, ఈ భార్యలదగ్గర, ఈ ప్రపంచకంలో...అదొక్కటే మిగిలింది.

తనెంతవరకూ బాధ్యుడు అని సింహావలోకనం చేసుకుంటే, ఒక్కటే నిలబడుతోంది. తను సంపాదిస్తున్నాడు, ఖర్చు పెట్టుకుంటున్నాడు. సంసారం కోసం. అయినా, ఈ సంపాదన ఆదర్శంను ఎడబాటు చెయ్యడానికే ఎక్కువ ఉపకరిస్తోంది కాని, ఉత్కృష్టత నివ్వడానికి ఒప్పుకోటం లేదు. ఎంచేతనంటే తృప్తి లేకపోవడంవల్ల.

తను బానిసత్వంలో ఓ మెట్టు పైకెక్కిన కొలదీ, ఆమెలో రెండు మెట్లు, నగలు నాణ్యాలకోసం ఆశ ఎక్కువైంది. డబ్బు కావాలి. ఖర్చుకాకుండా దాచగలిగే, చీర మడతల్లో కందిపప్పు డబ్బాల్లో, అల్యూమినం పెట్టెల్లో ఉండే డబ్బు. దాన్ని వెచ్చించి బజార్లో సవరనులు డబ్బు. కంసాలికిచ్చి నగలు చేయించుకుని "నే చేయించుకున్నా మా వూళ్లో" అని పెన్నులు విరుచుకునేందుకు పనికి వచ్చే డబ్బు. అది కావాలి.

ఈతృష్ణతో తనెంత దిగజారిపోతోందో అన్న ఆలోచన కూడా పోయింది. అదే దైవం అయిపోవడంతో, భర్త అన్న విచక్షణకూడా పోవడం జరుగుతోంటే, చూడలేని పరిస్థితులు కూడా వచ్చేయి.

"పోనీ విడాకు లిచ్చెయ్యకూడదూ?" అన్నాడు.

చీర కొంగు మొలకు దోపుకుంటూనే "అదొక్కటి దొరికింది ఈ మొగాళ్ళకు. ఎంత చేసినా కృతజ్ఞత అనేది లేదు. ఎప్పుడూ ఇంతే......" అని రుమాయించింది.

ప్రక్క ఇంటివారి కోడలు తెల్లబోయి చూస్తూనే నిలబడింది. సిగ్గుబడ్డాడు కుమిలిపోతూ. తన స్థితి అంతవరకూ వచ్చింది.

కోపంతోనే కృంగిపోతూనే 'రాత్రి పది ఘంటల బండికి పెట్టి అవీ సర్దుకో. కొన్నాళ్ళు దూరంగా ఉండడం ఇద్దరికీ మంచిది' అన్నాడు.

రవణమ్మ అంది 'చిన్నాయన వచ్చేడు. నువ్వు పోవచ్చు' అని.

"అల్లాగేనమ్మా!" అన్నాడు. ఈ సారి ఏడ్పు వచ్చింది. కళ్ళు తుడుచుకుంటూనే వెళ్ళేడు కుళాయి దగ్గరకు.

* * *

ఆ రోజు వెళ్ళనే లేదు ఆవిడ.

"నా ఇల్లు ఇది. నేను అస్తమానూ వాళ్ళింటికి, వీళ్ళింటికీ వెళ్ళను. నా ఇష్టం ఒచ్చినపుడు నేను వెళ్తాను. ఈ ఇంట్లో సామాన్లు అవీ నేను కొనుక్కున్నాను..." ఆ వరసలోనే చదివి మూతి ముడుచుకుంది.

తన దృక్పథంలోకి ఆమెను మార్చలేని ప్రశ్నలు సమస్యల క్రిందే తయారైయ్యేయి. ఆవిడ మారదు. తనే మారాలి. ఎల్లా మారాలి అన్నది తనకే తెలియని స్థితిలో పడిపోయేడు.

ఉద్యోగంలో నెలనెలా వచ్చే రెండు వందలుకంటే, ఇంకో ఘంట ఎక్కువ చేస్తాను, ఇంకో క్లర్కు సెక్షను కూడా పుచ్చుకుని గొడ్డులా పనిచేస్తాను అన్నా సర్కారు వారు ఇంకో ఏభై రూపాయలు ఎక్కువ యివ్వరు...పోనీ పైగా ఏమైనా ఒస్తుందేమో ప్రయత్నాలు చెద్దామనుకుంటే ఆ మార్గాలు ఎల్లా వుంటాయో, ఎల్లా రాయబారాలు సల్పాలో తెలియని విషయాలు. అవి నేర్చుకోలేదు, ఇన్నాళ్ళ జీవితంలోనూ. ఇప్పుడు నేర్చుకోవాలేమో అని అనుకున్నా, తను నేర్చుకోలేదు.

ఆ రోజల్లా తండ్రికి ఉత్తరం వ్రాసేడు. ఓ ఐదువందలు పంపమని. లేకపోతే తాను ఏ విధంగా మారుతాడో కూడా తనకే తెలియదని స్పష్టీకరిస్తూ.

నాల్గో రోజువరకు ఎదురు చూచాడు రెండు సార్లు పోస్టు బంట్రోతుని అడిగేడు. వాడు లేదని తలూపుతేనే కోపం వచ్చి, టెలిగ్రాం ఇద్దామా అనిపించింది.

అవ్వాళ ఆఫీసులో కూర్చున్నప్పుడు, ఆ పార్టీ తోటి గుమాస్తా డ్రాయర్లో పది రూపాయల కాగితం పడెయ్యడం, ఆ గుమాస్తా తెల్లకాగితాలు తీసుకునే మిషతో అది తీసుకోవడం, జేబులో పెట్టుకుంటున్నప్పుడు ఎవరైనా చూస్తున్నారేమో అని కలయచూడడం ఇవన్నీ కనపడితే, తనూ లంచం పుచ్చుకుంటే బావుంటుందేమో అన్న ఆశ కొంచెం సేపు కలిగింది.

ఇంటికి వచ్చేసరికి "ఆవిడ రెడ్డిగారి అమ్మాయి స్కూల్ ఫైనల్ చదువుతోంది. ఇంగ్లీషులో కాస్త లుకసానుగా ఉందట, ప్రవేటు చెప్పడానికి ఎవరైనా దొరికితే పెట్టుకుందామని ఉందట. మీ రెందుకు చెప్పకూడదూ; ఓ పాతికరూపాయ లిస్తారట!" అంది.

ఇంతవరకూ ఆ దృష్టి పోనేలేదు. ఓ విధంగా చూస్తే సమంజసంగానే కన్పించింది. అయినా ఉద్యోగంలో వుండే ఫాయిదా ఇంత నీచానికి ఒడికడతావా అనిపించింది.

"రేపొద్దున్న భిక్షాటనం కూడా చెయ్యమంటావ్" అన్నాడు కోపంలో.

కోపంతోటే ఆవిడా "రేపటికి...ఇవి లేవు, అవి లేవు అని అరడజను వస్తువుల



అన్నం తినడం మానేస్తే ఈ నెలలో చంద్రహారంకూడా చేయించుకోవచ్చేమో!

# ★ "చైతన్యం" ★

చెప్పింది. పైగా తీసుకురాకపోతే పొయ్యిలో పిల్లి లేవదండోయ్" అంటూ విభాయించింది.

డబ్బుండీకూడా, తను దాదకుని, కేటాయించిన డబ్బు ఉంచుకునీ, ఇల్లాంటి ఖర్చులకు ఎందుకు ఉపయోగించదా అన్న కోపంలోనే పళ్ళు కొరుక్కున్నాడు. అడిగినా ప్రయోజనంలేదని తెలుసు. పైగా తన దగ్గర ఈనెల ఇన్ని, ఆనెల ఇన్ని, సంవత్సరం క్రితం ఇంత, అని లెఖ్ఖలు చేసి వందరూపాయలవరకూ బాకీ అన్నట్టు తేలుస్తుంది, తను అవిడికి.

చాలాసార్లు డబ్బు ఆమెకు కన్పడనియ్యకుండా దాచుకోవాలనుకున్నాడు. తొందంలేని తన బొళ్ళపెట్టె ఒక్కటే ఉంది. ఇంకెక్కడ దాచుకోవాలో తెలియలేదు. అసలు జ్ఞానం వచ్చినప్పటినుండీ డబ్బు దాచుకోవాలన్న జిజ్ఞాసే కలగలేదు. అలవాటు కాలేదు. ఇప్పుడు తిట్టుకున్నాడు తన వెర్రివెంగళాయ తనాన్ని. అయినా అది చేతులు కాలినతర్వాత అన్నట్టేఉంది.

బజార్లోకి వెళ్ళి నల్గురైదుగుర్ని అడిగేడు అప్పు. అందరూ తలోరీతిగాను చెప్పేరు. సిగరెట్టు కొట్టువాడు, 'అయ్యో! పన్నెండు పెట్టెలయ్యేయి. పైసా లిస్తారా?' అన్నాడు.

నాన్నారి ఉత్తరమూ వచ్చింది "పెద్ద పెద్ద నగలు చేయించుకోవాలన్న కూతే కాని, ఒక్కనాడు మీ అమ్మ నగలు పెట్టుకుందా! ఎప్పుడూ ఇనప్పెట్టెల్లో మూలుగుతూనే, డెడ్‌కేపిటల్ అయి ఫ్రీజ్ అవుతున్నాయి..." అని వ్రాసేడు.

తిట్టుకున్నాడు మనసారగానే. ఆ వీధిక్లినే రెడ్డిగారింటికెళ్లి, తను ప్రవేటు చెపుతానని, పది రూపాయిలు ఎడ్వాన్సు పుచ్చుకుని, ఇంటికి వచ్చేడు.

సరుకులు అందిపుచ్చుకున్నప్పుడే "ఎక్కడిదండి డబ్బు! పత్రికవార్లు పంపేరా? మీనాన్నగారు పంపేరా?..."

"ముష్టి అడుక్కుని తెచ్చే. రోజూ ఇంతేగా! నాజీవనం. ఒక్కనాడైనా వీధిలోకి కెళితే తెలుస్తుంది. తెల్లారితేస్తే ఎవరు డబ్బులిస్తాడా అని వెతుకులాడ్డంలాగేవుంది. ఒక్కరోజూ ఆలోచించేవా? ఎల్లాంటి ప్రతిఫలంగా, ఈ సుష్టుగా తిండీ, బట్టా, సినీమాలు, నీకు ఇస్తుంటే, నాకు ఏమిమిగుల్చుతున్నావో?

నీకు స్వార్థం ఎక్కువైంది. అందులో కళ్లు కామెర్లు కెక్కేయి. ఇంక ప్రపంచకం అంతా పచ్చగా, బంగారమే కనిపిస్తోంది. జీవితాలు కన్పించవు..."

ఆవిడ మాట్లాడనేలేదు. నిజమా అని ఆలోచించాలనుకుంది; కాని కళ్ళపచ్చదనం అడ్డొస్తే "పోనీయ్" అనుకుంది. ఇది వరకన్నవాట్లో ఇదొకటి.

ఆసాయంత్రం బయటకు వెళదామనుకుని డబ్బులు చూచుకుంటుంటే [illegible] రూపాయిలు తక్కువ వచ్చేయి.

"నువ్వు తీసేవా?"

"రెండురూపాయలకట్టెలు, ఓరూపాయి గోధుమలు, చింతపండు తెప్పించే..." అంది.

ఒట్టి అబద్ధం అని తెలుసు. అవి వీరుడకల్లోకి, పిల్లల్ని పెట్టడాన్కి వెళ్ళానని నిర్ధారణే ఏంచేతనంటే, రెండు రోజులక్రితం ఆసరుకులు తనే తెచ్చేడు.

ఈవృత్తిని ఏమనాలో తెలియక బజార్లో పడి రెండాటలు సినీమాలు చూచివచ్చేడు.

* * *

అరోజు యాదాలాపంగానే "నీచంద్రహారం బాగుచేయించుకుందుకు ఏ[illegible]ం డబ్బు కావాలేమిటి" అన్నాడు.

"మాచేరూ!..." అన్న స్థాయిలో కిందలెత్తి ఆఖర్కు 'ఐదువందలు వుంటే నాల్గుపేటలు అవుతాయి' చేయించుకుంటే కొత్త దిట్టంగానే చేయించుకోవాలి" అంది.



తిరుపతిలో తెప్పపై దీపమాలలు

ఫొటో: శ్రీ [illegible]. [illegible], తిరుపతి.

తను ఐదువందలు సంపాదించాలన్న మాట. ఎల్లాగా అన్నది ఇదివరకు ఆలోచించి ఒదలిపెట్టేసేడు. సంపాదించాలి అన్న పట్టుదల పట్టుదలే కాదు గుండెలమీద కుంపటి. కనకదాహంతో కళ్లుమూసుకు పోయిన భార్యకోరకు అన్నదే మిగిలింది.

ఆపట్టుదలకోసం, ఆశకోసం, ఇంకో రెండుట్యూషన్లు, సినిమాలో గుమాస్తాగాను చేరేడు. ఈ సంపాదనలు అన్నీ కల్పితే నెలకు వందపైగా వచ్చేస్తున్నాయనుకుని తృప్తిపడ్డాడు. ఆ కరుకులు ఆనెలాఖరున పడేసరికి, గబగబావెళ్లి రెం~ ~వరసులు కొన్నాడు.

ఇంటికివచ్చితను, ఎక్కడ ఇవి దాచాలా అన్న సమస్యల్లో పడ్డాడు. ఇప్పుడే ఇచ్చేస్తే, తను ఇంక నిద్రపోలేడు. అంచేత నే రహస్యంగా ఆరెండు తన మంగలిపెట్టిలో పెట్టే నిద్రపోయేడు.

ఒకటో తారీఖు వెళ్ళేసరికి "ఏమండీ రెడ్డిగారు జీతం ఇచ్చేరా?— వాళ్ళమ్మాయి నిన్న మనింటికి వచ్చింది. క్రితం నెలజీతం నాకు తెచ్చి ఇమ్మందామనుకున్నాను..." అంది.

బహుశః నక్షత్రకుడు కూడా ఇంత క్రూరత్వం ఆ మహారాజుమీద చూపించలేదేమో! తను మాట్లాడలేదు.

"మీరు ఏనెల కానెల వసూలు చెయ్యాలి లేకపోతే వాళ్ళు ఇవ్వటం కష్టం అయిపోతుంది. మొన్న కంసాలిని అడిగేను. అరకాసుబంగారం అయితే నల్లపూసలు చుట్టించుకోవడం అవుతుంది. పాతిక తోటి తెప్పిద్దా మనుకుంటున్నాను" అంది.

"అన్నం తినడం మానేస్తే, ఈ నెలలో చంద్రహారం కూడా చేయించుకో వచ్చేమో!

"మీ సిగరెట్లకు వాట్లకు నేనడగనప్పుడు, ఒక్కఖర్చు నేను చేస్తానంటే, అంత పిసుక్కుంటారెందుకు? ఎన్నాళ్ళు ఈ పసుపుతాడుకు పూసలు గుచ్చుకో మన్నారు..."

ఆ వరసలో వాదన పెరిగిపోయింది. ఒక్కక్షణం ఉండబట్టలేకనే, భుజాన్న ఖండువా వేసుకుని, బజారుకు వెళ్లేడు. చేతి నున్న అరకాసు ఉంగరం, పెళ్ళినాడు ఇచ్చింది, కరగించి, బంగారం కొన్నానని చెప్పి ఇచ్చేడు.

కరిగేటప్పుడే పోనీ ఓ కాసులో సగం ఇస్తేఏం? అనుకున్నా, మనస్సు మగతనంకు దెబ్బతీస్తోంది. ఆ దాహం పూర్తిగా ఇస్తే నే కాని ఆమెలో తృప్తి, తన గొప్ప నిలబడ వనుకునే మానేసేడు.

ఇది జరిగిన రెండురోజుల్లోనూ ఆకాశం మేఘాల్తోనిండి వర్షంకురిసింది. మంచి కూరల్తో పాయసంతో భోజనం పెట్టింది. రాత్రి మల్లెపూలు పెట్టుకుని "అప్పుడే నిద్ర పోతున్నారా?" అంది.

"ప్రొద్దున్న వెడతారు, రాత్రి పదింటి వరకూ మళ్ళీ రానేరారు...నేను ఒక్కదాన్ని ఇంట్లో వుండడం కష్టంగా వుంటోందండి."

"మీరు తిండిసరిగ్గా తింటంలేదు. చిక్కిపోతున్నారు? ఆఫీసుల్లో పని ఎక్కువైందా" ఫ్లాస్కు ఒకటికొంటే కాఫీ నేనే పోసిస్తాను కదా? కాఫీహోటళ్ళకు వెళ్ళడం ఎందుకు?"

ఫ్లాస్కు! ఎనిమిదిరూపాయిలు ఖర్చుపెట్టి కొంటానికి తయారైతే కొనమనదు

## మాస్కోలో మే దినోత్సవం

—ఫొటో: టాస్.



# "చైతన్యం"

...తా సమయాన్ని, "ఎందుకూ మన సుఖ సంభురేందిరా" అంటుందని తెలుసు.

"మాట్లాడకేం ?"

"బంగారపుగని ఎక్కడైనా దొరుకుతుం దేమో అని వెతుకుతున్నా దొరికితే నీకు అపాదమస్తకం తొడుగు చేయిద్దామని..." అన్నాడు.

ఒక్కటి తను ఇతరులకు ఇంకా ఎవరెవరికి ఊడిగం చేస్తున్నాడు తెలియకుండా ఉన్నందుకు సంతోషించేడు. అది ఓ విధంగా తేలికనిచ్చింది. తెలిస్తే...తను ఊహించుకో లేడు...

ఆ శ్రావణమాసంలో ఆవిడ వాళ్ళవూరు వెళ్ళింది; ఉన్నకాలంలో నెలకు ఏభై రూపాయిలు తప్పకుండా పంపించా లన్న బాసమీదనే.

ఇంటికివచ్చి మంగలిపెట్టె తీసేడు వాళ్ళు కాసులు తనెంత గొప్పవాడో అను కున్నాడు. చూచేడు. వాట్లని తడిమేడు... నీరసం వచ్చింది. నిద్రపోయేడు...నిద్ర... సుఖంలోనే ఆశతో కలల్లో అవి అతనం చుడు అయినట్లు,...అల్లా......

* * *

ఆ నెలాఖరుకు నాలుగు, ఆరుగా మారడంతో ఆనందం ఎక్కువైంది. వాట్లని ముట్టుకున్నప్పుడు శరీరం పులకరెత్తేది. ఒక్కొక్కసారి తను భార్య చెప్పడంలో జీవితసత్యం ఉండిపోయిందేమో అనుకునే వాడు. 'నిజమే డబ్బు' బంగారం సంపాదించి తనూ గొప్పవాడు అని నలుగురూ అనుకునేట్లు చేసుకుంటే......"

ఎంతో చక్కగా ఆశ మొలకలెత్తింది. "భలా నా వారు లక్షాధికారి..." అనుకుంటే మేఖాలమీద శరీరం ఊయల వేసింది. సంపాదించాలి. గణించాలి...ఇవి తారకనామం అయిపోయేయి...

ఉదయంకూడా ఖాళీయే గదా అని ఇంకో ఇంటర్మీడియట్ అబ్బాయికి ప్రవేటుకు ఒప్పుకున్నాడు. సిగరెట్లు అంత ఖరీదు వెందుకని, పెట్టె రెండణాల రకం లోకి దిగేడు...ఉదయం కాఫీ ఎందుకని ఆ పావుశేరు పాలు కాచకుండానే త్రాగే వాడు. పూర్తిగా నలభైరూపాయిలెందుకు హోటలుకని, ఇంట్లో అత్తెసరు వేసుకుని ఆవకాయతోనే తినేవాడు......

నెల్లాళ్ళు తిరిగేసరికి, శరీరంలో పటుత్వాలు తప్పేట్లుఉన్నా, ఆకలి బలహీనతా ఒచ్చి, కళ్ళుమగతక్రమ్మినా, ఆ సవరనులను తీసి ఒకటి...రెండూ...తొమ్మిది...పదీ.. లెఖ్ఖపెట్టేసరికి, జీవితంలో, ఈ ప్రపంచాన్ని జయించేననే అనుకుని తృప్తి, మరుపు కల్గించుకునేవాడు. తను సంపాదిస్తున్నాడు. అని ప్రపంచాన్కి చాటాలన్న పట్టుదల...బానిసత్వం...ఆ బంగారం చూచేసరికి ఏర్పడే కళ్ళమైకం అతన్ని ఆవరించింది. భార్య మాటలకంటె, తన క్రియాత్వం ఇప్పుడు గొప్పదేమో అనుకున్నాడు.

శరీరం ఎప్పుడైనా కాలిపోయేదే...కాని బంగారం కాదు అన్న విపరీత తత్వం అలవడిపోయింది.

ఆ మూడు నెలలు జరిగేసరికి అటు పది హేను అంకెలుగా అవి చేరడం, ఇటు తను ఎముకల ప్రోగు అవడంతోటి ప్రపంచం పతనమైంది. ఆ రోజుల్లో అనేకమంది స్నేహితులదగ్గర హేళనకు పాత్రుడయ్యేడు. ఇంత పీనాసితనంతో, ఆఖరుకు కాఫీయేనా త్రాగకుండా గడుపుతున్నందుకు. అన్నిట్లకీ నవ్వేడు. జీవంలేని నవ్వుల్లో కాసుల గలగల వినిపించేది.

ఇంత విలువగల బంగారం తను ఇంట్లో దాస్తే, తను లేనప్పుడు ఎవరైనా దొంగిలిస్తారేమో అన్న భయంతో మొలలోనే కట్టుకునే వాడు. అవి దగ్గరగావుంటే, తనకి ఆలోచన వచ్చినప్పుడల్లా ఓసారి స్పర్శానుసుఖం అనుభవించేవాడు.

ఆ ఉదయం మామూలుగానే ప్రవేటు చెప్పేడు. విద్యార్థి "మీ ఎస్సేలు బట్టీపట్టి వ్రాస్తే, క్లాసుకు ఫస్టువచ్చేనండి...నోట్సు ఎందుకు వ్రాయకూడదూ!" అంటూనే "ఇంకో ఇద్దరు వున్నారండీ వాళ్ళకూడా .."

ఆశ మొలకలెత్తింది. ఇంకో రెండునవరసలు వస్తాయన్న ఆశ ... ఒప్పుకుందామా అన్న పిపాస..."రేపు చెప్తా..."

ఆఫీసులో సాయంకాలంవరకూ పని చేసేడు. కళ్ళు తిరుగుతున్నాయని కుర్చీలో కూలబడిపోయాడు. ...నీరసం...వరనరాలుతో తేసేటట్లు...

అంతే...

* * *

కళ్ళు తెరిచేటప్పటికి ఇంట్లో మంచం మీద పండుకుని ఉన్నాడు. తలపోటు ఒళ్ళునెప్పులు తీపిగా విజృంభించేయి...

క్షణికం...మొలలో లోపలగా, తడిమేడు...ఉన్నాయి...

"ఏమండీ! తెలివి వచ్చిందా?" ఆవిడ. తెల్లబోయాడు...కళ్ళు మూసుకునే ఆలోచించేడు. తను ఎన్ని రోజులు...కేలండరులో మూడు రోజులు జరిగేయి...

ఏమైంది?

"ఆఫీసులో ఒళ్లు తెలియకుండా పడిపోయేరుట. టెలిగ్రాం ఇచ్చేరు......మూడు రోజులనుండి కన్నైనా విప్పలేదు. తేలిపోయే జ్వరం...డాక్టరు అన్నాడు...... సరైన పోషణలేక శరీరం తిరగబడిందని..."

కళ్లు చెమ్మబడ్డాయి...చూడలేక మూసుకున్నాడు.

"నువ్వు వచ్చేవా!...నాకోసం..."

"నాకోసం...ఏమిటండీ?..." ఆశ్చర్యపడింది.

మొలలో చూపించేడు...ఆమె... విప్పింది...పదిహేను సవరనులు...

తెరవలేని కళ్ళల్లోంచి చిలిపిగా చూచేడు...కృతజ్ఞతకోసం...

ఆమె లెఖ్ఖ పెట్టింది. క్షణికం మొఖంలో రక్తం లేవట్లే. ఆయనవైపు చూచింది. వెనక్కు తిరిగిన నెలలు ఒకటి తన్నాక

ఒకటి...అందులో...తను చేసిన ఘన కార్యాలు...

ఎందుకూ ఈ బంగారం ఇవ్వటం! ఆయన వుంటేనే గాక! అనిపించింది. తల చుకోలేక పోయింది. కళ్ళమ్మట నీళ్లు కరిగేయి. తను ఓ బ్రహ్మరాక్షసి అనుకుంది...

"శరీరం కాల్చి సంపాదించే..." ప్రతి క్షణంలో దాని కృతజ్ఞతకు దెబ్బ తిని... సొమ్మసిల్లి పోయేడు. గ్లాసు నీళ్లు చెంచాతో పోస్తుంటేనే ఆతని హృదయం మీద కన్నీళ్ళ చినుకులు పడ్డాయి.

(56 వ పేజీ చూడండి)



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 131. నక్షత్రాలు మినుకు మినుకుమని యెందు కంటాయి?

నక్షత్రాలు మినుకు మినుకు మనడానికి కారణం భూ వాతావరణమే. భూ వాతావరణం వాయురూపంలో నున్న అనేక ద్రవ్యాల మిశ్రమం. ఆక్సిజని, నైట్రోజని, కార్బన్ డయాక్సైడ్, ఆర్గాన్, నియాన్ వంటి అనేక వాయువులు, దుమ్ము, నీటి యావిరి అందులో ఉన్నాయి. వాతావరణంలో నున్న యీ పదార్థాల మొత్తంలో విపరీతమైన మార్పులు ఎన్నడూ సంభవించవుగాని కొద్ది మార్పులు మాత్రం అనుక్షణమూ కలుగుతూనే ఉంటాయి. నక్షత్రాల కాంతి ఈవిధంగా అనుక్షణంగా కొద్దిపాటి మార్పుకు లోనవుతున్న వాతావరణంగుండా ప్రయాణం చేసినతరువాత నే మన కండ్లను చేరుకొంటుంది. అప్పుడే నక్షత్రాలను మనం చూడగలుగుతున్నాం.

కాంతి కిరణాలు ఒక యానకం (*Medium*) లో నుంచి దానికి వ్యత్యాస సాంద్రతగల మరో యానకంలోనికి ప్రయాణం చేసినపుడు వక్రీభవనాన్ని (*Refraction*) పొందుతాయి అంటే వంగుతాయని మనకు తెలుసును. అందుచేత నక్షత్రాలనుండి బయలుదేరి భూమికీ నక్షత్రాలకూ మధ్యనున్న శూన్యప్రదేశంలో చాల దూరం ప్రయాణం చేసిన నక్షత్ర కాంతి కిరణాలు భూ వాతావరణాన్ని చేరుకొనిన వెంటనే, భూ వాతావరణ సాంద్రతకు శూన్యప్రదేశ సాంద్రతకు తేడా ఉండడం వలన, వక్రీభవనాన్ని పొందుతాయి. నక్షత్రం వాస్తవంగా ఏ దిశలో నున్నా ఆ దిశలో గాక ఈ వక్రీభవన కిరణదిశలోనే మనకు కనిపిస్తుంది.

భూ వాతావరణ సాంద్రతకు, భూ వాతావరణంవలన నక్షత్రకాంతి పొందే వక్రీభవన పరిమాణానికి అవినాభావ సంబంధముంది కాబట్టి, భూ వాతావరణ సాంద్రతలో మార్పేమీ లేకపోతే నక్షత్రం సదా ఒకే దిశలో మనకు కనిపిస్తుంది. కాని వాతావరణ తాపక్రమంలో అనుక్షణమూ వచ్చే యీషణ్మాత్రమైన మార్పులవలన వాతావరణ సాంద్రతకూడా సదా మార్పును పొందుతుంది. ఈ మార్పున కనుగుణంగా నక్షత్ర కాంతి పొందే వక్రీభవన పరిమాణం కూడా మారుతుంది కాబట్టి నక్షత్రం మనకు కనిపించే దిశలో మార్పు వస్తుంది...ఆ కారణంచేత నక్షత్రా లెల్లపుడూ ఒకే దిశలో గాక అటూ యిటూ జరుగుతూ, నాట్యమాడుతూ కనిపిస్తాయి. నక్షత్రాలు మినుకు మినుకు మనడానికి హేతు వదే.

చంద్రగోళంలో వాతావరణం లేదు కాబట్టి అక్కడనుంచి చూచినపుడు నక్షత్రాలు మినుకు మినుకు మంటూ కనిపించవు.

'అనంత్'

## 132. పొద్దు తెలుసుకునే పద్ధతిట!

రోజల్లా మబ్బుగా ఉంటే ఎప్పుడేనా ఒక సమయములో వేళ ఎంతయిందో తెలుసుకోడానికి జ్యోతిష శాస్త్రజ్ఞులు ఒక సూత్రము ఇచ్చారు. చేతి అయిదు వేళ్ళూ చాచి, ఒక పిల్లవాణ్ణి ఏదో వేలు ముట్టమన్నారు. తర్జనిని ముట్టుకున్నాడనుకుందాము. అప్పుడు ఈ క్రింది పట్టికని పరిశీలించుకున్నారు.

| | | | |
|---|---|---|---|
| అంగుష్ఠము | 1, | 6, | 11 |
| తర్జని | 2 | 7 | 12 |
| మధ్యమ | 3 | 8 | 13 |
| అనామిక | 4 | 9 | 14 |
| కనిష్ఠ | [illegible] | 10 | 15 |

ఈ పట్టికలో 1, 2, 3 అనే అంకెల్ని వరాసగా వేళ్ళకి సర్దేశారు. ఇప్పుడు బాలుడు ముట్టుకున్న తర్జనికి ఎదురుగా 2, 7, 12 అంకెలున్నాయి. వేళ తెలుసుకోవలసిన ఆ సమయము రాత్రో పగలో అవుతుందిగదా. పగలు 30 గడియల ప్రమాణమూ, రాత్రి 30 గడియల ప్రమాణమూను. కనక ఆ సమయానికి ఎన్ని గడియలు గడచినవి? అని ప్రశ్న. 2 గాని, 7 గాని, 12 గాని గడిచి ఉండాలట. ఎన్ని గడియలు గడిచి ఉంటాయో ఊహించి చెప్పేయమన్నారు.

అంటే ఏమన్నమాటా? పగలునీ రాత్రినీ, ఏవో మూడుఘట్టాలుగా, (1, 6, 11 గానీ; 2, 7, 12 గానీ 3, 8, 13 గానీ; 4, 9, 14 గానీ; 5, 10, 15 గానీ,) విభజించారు. ఈ విభజన సమభాగాలుగా కానే కాదు. అయిదు వేళ్ళ పేర్లూ రాసి వరసగా అంకెలు వేశేశారు. బాలుణ్ణి ఒక వేలు తాకమన్నారు. బాలుడికి ఇదీ అదీ అని తెలియదుగా? కనక సత్యమైనదే తాకుతాడని ఊహ నమ్మకానూ. వాడు తాకడానికి వీలయినవి అయిదు వేళ్ళున్నాయి. తెల్లవారుగట్ల నాల్గింటికి ఈ ప్రయోగము చేశారనుకోండి. బాలుడు కనిష్ఠను (చిటికెన వ్రేలిని) తాకినాడనుకోండి. 5, 10, 15 లలో ఏదో ఒకటేగదా చెప్పాలి? 15 అని చెప్పినచో, రాత్రి పన్నెండు గంటలన్నమాట. ఈ పద్ధతి రాత్రి 12 గంటల్ని దాటడానికి వీలులేదు. 15 అన్నిటికంటే పెద్ద అంకె. ఈ ప్రయోగము ఎప్పుడు చేసినా వేళ రాత్రి 12 గంటలకి దాటదు.

దీనిని సర్దుకోవాలంటే దినమును నాలుగు భాగాలు చేసుకోవాలి. సూర్యోదయమూ, మధ్యాహ్నమూ, సూర్యాస్తమయమూ, అర్థరాత్రీని. అప్పుడు రోజంతా లెక్కకి వస్తుంది. అప్పటికే 6 గంటల కాలమును అనగా 15 ఘడియల్ని మూడుముక్కలుగా కొట్టినట్లవుతుంది. (1 కీ 6 కీ, 6 కీ 11 కీ ఐదు గడియలు తేడా) ఇక ఈ అయిదు పంక్తులలో ఏది పట్టుకోవాలీ అన్నది బాలుడు నిర్ణయిస్తాడు. అంటే ఛాన్సు నిర్ణయిస్తుంది.

మొట్టమొదటే ఛాన్సు ఊనా కొట్ట కూడదూ? ఇలాగ ఊహించిన కాలాన్ని బట్టి జాతకాలుకూడా రాశేవారట వాచీలు వచ్చేవరకూ! ఒక్క నిమిషము పుట్టుక తేడా అయితే జాతకము మారిపోవచ్చు

అంటారే?—మరి ఈ పద్ధతి ఏమిటే? ఇంతకంటె, ఒక రాత్రిగాని పగలుగాని ఎన్ని రకాల జాతకాలుండడానికి వీలో రాశేసుకుని, ఒక వ్యక్తి పుట్టినకాలము సుమారుగా ఇంత అని ఊహించి, ఆ ఘడియకి ఇటూ అటూ వచ్చే జాతకాలు చూసి ఆ వ్యక్తికి అప్పటివరకూ వున్న అనుభవాల్ని బట్టి అసలు జాతకం ఇదీ అని గుర్తించుకునీ ఆ జాతక ఫలితాలు చెప్పడము మెఱుగు కాదా?

అయితే పైన ఇచ్చిన కాలము కనుక్కునే పద్ధతి ఏమయిపోతున్నట్లూ?

జ్యోతిష్కులు ఒక్క సమాధానము చెప్పగలరు. అదిది: "అయితే వాచీలు లేనప్పుడు మబ్బు గమ్మివుంటే నువ్వెలా చెప్తావూ వేళా?" అని. దానికి జవాబు 'ఊహించి' అని: ఇలా ఊహించి చెప్పినదానికంటె పై పద్ధతి ఏమాత్రమూ కచ్చితము కాదు. ఒ.. కుర్రవాణ్ణి అయిదు వేళ్ళలో ఒకదాన్ని స్పృశించమనడముకంటె అయిదుగురు పెద్దలు ఊహించిన వేళల సగటుగానీ, వారూహించిన వేళలలో మూటికి మించి సరిపోతూన్న వేళల సగటుగానీ తీసుకోడము పై పద్ధతికంటె మహాశ్రేష్ఠము.

## 131. దేవాలయాలలోని దేవుళ్లు వెలిశారా?

దేవాలయాలలోని దేవతా విగ్రహాలన్నీ స్వయం వ్యక్తమై వెలిసినవే కాని శిల్పులెవరూ చెక్కి తయారు చెయ్యలేదని పెద్దలు చెపుతారు. ఇది నిజముకాదు. చెక్కిన శిల్పి ఫలానావాడు అని చెప్పడమూ రాసుకోడమూ భారతీయ సంప్రదాయము కాదు. అజంతా, బాఘ్ విహారాలలోని వర్ణచిత్రాలూ, సింహళంలోని 'సిగిరియా' చిత్రాలూ పుదుక్కోట చేరువన వున్న సిత్తన్న వాసాల్, తంజావూరు బృహదీశ్వరాలయ చిత్రాలూ, కంచి కైలాసనాథాలయ, లేపాక్షి చిత్రాలూ, చివరికి నిన్న మొన్నటివైన సింహాచలమూ శ్రీకూర్మమూ చిత్రాలూ రచించిన వారెవరో మనకి తెలియదు. ఈనాటి చిత్రకారులవలె నాటి చిత్రకారులు చిత్రాల [illegible]సని తమ పేరు రాసుకోలేదు. విగ్రహ శిల్పులుకూడా తమ పేరుగాని ఇంకే పేరుగాని విగ్రహాలకి చుట్టుపట్ల చెక్కలేదు. [illegible]మొవ్వలోని ఉత్సవవిగ్రహము 'కనకమువ్వ' అన్న అక్షరాలు చెక్కబడి ఉన్నాయి. ఇది చిత్రమే) ఒక్క [illegible] శిల్పులు తప్ప వాస్తుశిల్పులు కూడా [illegible]ము పేరు చెక్కుకున్నట్లు కనపడదు. కనక దేవాలయాలలోని విగ్రహాలు చెక్కిన శిల్పులెవరో తెలుసుకోడానికి వీలులేదు. రోమానగరములో సెయింటు పీటరు చర్చిలో ప్రఖ్యాత రోమక శిల్పి మైకెలాంజిలో చెక్కిన 'లాపయటా' అన్న జీసను మేరీల పాలరాతి శిల్పముంది. అది పూజలో ఉంది. ఆ శిల్పాన్ని చూచినవారందరూ మొదట తలుచుకునేది 'మైకెలాంజిలో' ని భక్తిమాట దేవు డెరుగును! కాబట్టి పూజలో ఉన్న దేవతావిగ్రహాల్ని ఎవరు చెక్కారో తెలుసుకోడమువల్ల లాభము లేదు.

అలాగని వాటిని మానవులు చెక్కనే లేదనుకోడము వెర్రి. లింగములన్నీ నల్లరాళ్లనో, పాలరాళ్ళనో, స్ఫటికాలనో చెక్కి తయారు చేసినవే. రూపము ఒకే మాదిరిగా వుండడమువల్ల కాలభేదము చెయ్యడము కష్టమే కాని అసాధ్యము కాదు. పల్లవుల దేవాలయ లింగములు మనిషెత్తున వుంటాయి. కొన్నిటికి పలకలుండడమూ కద్దు. శ్రీకూర్మమూ, సింహాచలమూ మొదట శైవక్షేత్రాలు. వైష్ణవాచార్యుల దండయాత్రలలో వైష్ణవాలయాలుగా మారినవి. శ్రీకూర్మము శైవక్షేత్రముగా ఉండిన నాటి అమ్మవారు (పార్వతి) ఇప్పటికీ శ్రీకూర్మములో గుళ్లో ఒక గూడులో ఉన్నది. సింహాచలంలో గర్భగుడిలో నడుమనున్న లింగాన్ని చెక్కి నేటి 'వరాహ నరసింహ' రూపానికి తెచ్చిన చిన్నెలు నిజరూప దర్శనములో చక్కగా తెలుస్తాయి. తెలుగు దేశములోని వైష్ణవ క్షేత్రాలన్నిటా ప్రతిష్ఠింపబడ్డ నరసింహస్వామి అహోబల వైష్ణవ మఠస్థాపనానంతరముగాని తెలుగుదేశానికి వచ్చిన సాక్ష్యము లేదు. ఉపమాక, అంతర్వేది, మంగళగిరి, కదిరి, సింగరాయకొండ స్వాములు రామానుజలతోనే ప్రతిష్ఠింపబడ్డారు. వెంకటేశ్వర స్వామి ఆగమనానికి ముందు తిరుమలలో వరాహస్వామి ఉన్నట్లు స్థలపురాణము చెప్పుతుంది. తిరుపతిస్వామి విగ్రహము పల్లవుల కాలంలో మలచినట్లు రాయిగట్టిన నిటారురూపమూ, కటిబంధ హస్తమూ సాక్ష్యమిస్తాయి. మహాబలిపురమంతటా కటిబంధ హస్తాలూ, నిటారు రూపాలే. అలమేలు మంగాపుర దేవాలయము మొదటిసారి పల్లవదంతి విక్రమవర్మ శాసనములో చెప్పబడింది. (క్రీ. శ. 884) అప్పటికి తిరుమల దేవాలయ ప్రస్తావనే లేదు. తరవాత వచ్చింది.

(శ్రీకాకుళము వద్దనున్న) అరసవెల్లిలో సూర్యనారాయణస్వామి ఆలయముంది. దానిలోని స్వామి విగ్రహము వంగదేశమును 11, 12 శతాబ్దాలలో ఏలిన పాల, సేన, రాజుల శిల్పాలను పోలిఉంది. పిఠాపురపు కుక్కుటేశ్వర స్వామి రూపము రుద్రాక్షధారియైన యోగిశిరస్సు కొట్టినట్లున్నది. శైవులు బౌద్ధులనూ జైనులనూ జయించినారని సోమదేవరాజీయము చెప్పేకాలంలో జైనదేవాలయంగా ఉండిందేమో. శైవులాక్రమించారు. పిఠాపురంలో జైన విగ్రహాలెన్నో చెల్లాచెదరుగా వున్నాయి. దాక్షారామంలోనూ ఉన్నాయి ఒకటి రెండు. దాక్షారామలింగమూ, చాళుక్య భీమవర లింగమూ కూడా, బౌద్ధస్తూపాల ఆయక స్తంభాలులా గున్నాయి. అలాంటిది మరొకటి చాళుక్య భీమవరంలో దేవాలయానికి బయట ధ్వజస్తంభము లాగుంది.

దేవాలయాలలోని దేవతా విగ్రహాలన్నీ శిల్పులు చెక్కిన తరువాత ప్రతిష్ఠచేసినవే. వెలిసిన వేవీ కావు.

## చిట్టిప్రశ్నలకు జవాబులు

—సాలె పురుగు ఒకచోటినుంచి ఇంకొకచోటికి నిరాధారముగా దారము తీయలేదు. ఒకసాలెపురుగు గోడమీదగాని కిటికీమీదగాని పాకుతున్నప్పుడు కార్డుతో చిమ్మేయండి. కిందపడేటప్పుడు అది స్రవించే ద్రవము గాలి స్పర్శకి వెంటనే ఆరిపోయి, తీగలు సాగినట్లు కనిపిస్తుంది. ఈ దారము సాయమువల్లనే అది తపీమని నేలమీద పడదు. దిగుతుంది. ఇలాంటి దారాలతో అల్లినదే సాలెపట్టు.

—'వారఫలితాలు:' ఏదిరాశినా నమ్మే వెర్రివాళ్లని బెల్లించి సొమ్ముచేసుకోనెంచే గడుసు జ్యోతిష్కుల బంగారువల అది. ఫలితాలన్నీ 12 రకాలు. అంటే మనదేశపు వారినందరినీ 12 గకాలుగా భాగించేస్తున్నారన్నమాట ఈ జ్యోతిష్కులు. ముక్కోటి ఆంధ్రులకూ 12 రకాల అనుభవాలే ఖాయము వీరిభావనావీథుల్లో!

ీడ ఆంధ్ర
కళా
లో బాలి
ంచిన
లు




ఆటవిడుపు

కుమారి బి. ప్రమీల





వెన్నెల రాత్రి

కుమారి పి. కృష్ణవేణి






# గుణపాఠము



శర్మాజీ-బ్రహ్మాజీ

పల్లెటూరి వీధిలోన
బాలు రాడు కొనుచునుండ
పట్టపగలె దొంగ యొకడు
పసిడి పతక మపహరించె

పిల్లలంద రొక్కసారి
గొల్లుమనగ, పెద్దవారు
పారిపోవుచున్న దొంగ
బట్టి, కట్టి, కొట్టిరంత

ఒడలు చిమ్మ నెత్తురులను
జడిసిపోయి దొంగపలికె
"తప్పు చేసినాను-ప్రభులు
దయదలచిన చాలునంతే-

పొట్టగడుచు సాధనమ్ము
పుట్టలేదు నాకెక్కడ.
బుద్ధివచ్చె నింకెప్పుడు
పోవనిట్టి పనికి మరల"

వానిమాటలన్ని కల్ల
కాన విడువరాదనుచును
కొట్టుచుండ పెద్దవారు
బిట్టుగ రోదించె దొంగ.

దొంగయేడ్పు సీతమ విని
తొందరగా వచ్చి పడియె
"మన వలెనే ఈతడునూ
మానవుడని తోచలేదె!

మనసు కరుగు వీని ఏడ్పు
వినపడదే-విడువుడింక
నేరము చేసితినంచును
నీతిపరుడు ఒప్పుకొనడె"

అనుచు వాని కట్లు విప్పి
ఆదరముగ తిండిపెట్టి
"అన్నా-ఈ పాడుపనులు
ఎన్నాళ్లకు వలదన్నా!

కూడులేక పోవుగాక
కూడ దిట్టి పనియెప్పుడు.
వసుధలోన నీ జీవిత
పథము మారె నేటినుండి"

అనుచు పసిడి పతకమిచ్చి
అనిపెను దొంగను సీతమ.
నాటినుండి లేదక్కడ
నేటివరకు దొంగతనము

డొక్కా సీతమ్మ తల్లి
నిక్కముగా నన్నపూర్ణ
వరనారీమణుల కతన
పరిమళించె తెనుగుజాతి



అద్దె బోటులో -

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

### 5

అసలు జరిగిందేమిటంటే- నేను కింగ్‌స్టన్, మ్యూజియమ్‌లు, ముందుముందు శతాబ్దాల్లో మన ఇప్పటి వస్తువులికి రాగల విలువా మొదలైన విషయాలు ఆలోచిస్తూ—అంటే పరధ్యానలో పడిపోయి, చేతులో చుక్కాని వొదిలేశా నన్నమాట. అందుమూలాన పడవ ఎడాపెడా ఊగిసలాడిపోయింది. దాంతో ఒక్క క్షణంపాటు ఒడ్డేదో, నీరేదో, బోటేదో తెలియనంత కంగారైపోయింది. అయితే మళ్లీ బోటు నిలదొక్కుకోడానికి అట్టేసేపు పట్టలేదు.

హారిస్ ఇంక తనవొంతు తీరిపోయిందని చెప్పి కాస్సేపు నన్ను తెడ్లువెయ్యమన్నాడు. సరేనని ఇద్దరం జాగాలుమారి కూర్చున్నాం. నేను తెడ్లు వేస్తున్నాను.

బోటు హాంప్టన్ కోర్టుపక్కగా పోతోంది, ఇక్కడ వొడ్డు పొడుగునా కొద్ది ఎడంగాదానితాలూకు పాతగోడ ఒకటుంది. పాతబడిన ఆలేతరంగూ అదీ ఆగోడ నాకెప్పుడూ చూడ ముచ్చటేస్తుంది. అది చూసినప్పుడల్లా నాకు గుండె మెత్తబడుతుంది. అక్కడా అక్కడా ఏవో తీగలూ, నాచూ, ఒకచోట ఇసకనుంచి పెరిగి పైనుంచి నదీ ప్రవాహాన్ని తొంగి చూస్తున్నట్టుండే ద్రాక్షతీగా అదంతా నేను మరిచిపోలేదు. ఆగోడమీద ప్రతి పదేసి గజాలకీ యాభై తరహాల రంగులూ మాపులూ కనపడతాయి. నాకే బొమ్మ వెయ్యటం చేతనైతే చక్కని బొమ్మ తయారయ్యేది. ఈహాంప్టన్ కోర్టుకి దగ్గిర్లో ఉండాలని చాల సార్లు అనుకునేవాణ్ణి. ఇక్కడంతా ప్రశాంతంగా ఉంటుంది. ఎవ్వరూ లేవకముందే ప్రొద్దుటిపూట ఇక్కడ పచార్లు చెయ్యొచ్చు.

నిజంగా ఇక్కడ ఉండటం అంటూ సంభవిస్తే కష్టమేనేమో ననిపిస్తుంది కూడా. సాయంకాలం వేళ బాగులు బాగులుమంటూ ఉంటుంది. చేతిలో లాంతరు పట్టుకుంటే నీడలు బెదిరిస్తాయి. చీకటిలో దూరాన కటిక రాళ్లపైన అడుగుల చప్పుళ్లు దగ్గిరికి వచ్చినట్టూ మళ్లీ అంతలోకే దూరమైపోయినట్టూ వినపడుతుంటే, నాగుండె కొట్టుకోడం నాకే వినపడుతూ మరే చప్పుడు వినపడని నిస్తబ్ధత ఆవరించినప్పుడు భరించడం కష్టం.

మనం సూర్యదేవుడికి అలవాటుపడ్డవాళ్ళం- మొగాళ్లు ఆడాళ్లు కూడా. మనకి వెలుగూ ప్రాణికోటీ ఉండాలి. అందుకే మనం పట్నాలలోను నగరాల్లోనూ పోగవుతాం. ఏటేటా మనపల్లెల నిర్జనాలౌతూ ఉంటాయి. ఎండ వెలుగున్నప్పుడైతే— అంటే పగటివేళమాత్రమే, ప్రకృతి అంత

మూలం: జెరోమ్ కె. జెరోమ్  అనువాదం: విశ్వాత్ముల నరసింహమూర్తి

#  ముచ్చటగా ముగ్గురు 

చైతన్యంతో తీరిక లేనట్లున్నప్పుడు, కొంత చరియలకే వట్టమైన అడవుల్లోకి వెడతాం—కాని రాత్రివేళ, భూమాత నిద్రపోతున్నప్పుడు మనం ఒంటరిగా— అబ్బో! ఆ ఒంటరితనం భరించలేం. భయంకరంగా. ఎవరూ లేనియింట్లో పసిపాప బిక్కు బిక్కు మంటున్నట్లుంటుంది. అటువంటప్పుడు కూచుని ఏడుస్తాం. దీపాలున్న వీధులు, మనుష్యుల కంఠాలు, జన సంచారం కోసం ఆక్రోశిస్తాం. చీకటిలో చెట్లు ఈదురు గాలిలో హోరుమంటున్నప్పుడు ఇంత బ్రహ్మాండమైన నిస్తబ్ధతలో మనం ఎంతో చిన్నవాళ్లమనీ నిస్సహాయులమనీ అనిపిస్తుంది. చుట్టూ ఉండే అనేక దయ్యాల ఊర్పులకు గుండె బిగుసుకుపోతుంది. అబ్బ! ఇదేం లాభంలేదు. మనం వేలకొద్దీ పెద్దపెద్ద నగరాల కెళ్లిపోయి వెయ్యిదీపాల కాంతుల్లో గుమికూడి కూర్చుని పాడుతూ కేరింతలు కొడుతూ ధైర్యం పుంజుకోవాలి.

హారిస్ అడిగాడు నన్ను "ఎప్పుడేనా హారిస్ కోర్టులో పొదల వ్యూహంలోకి వెళ్లావా?" అని— వ్యూహం అంటే—పువ్వుల మొక్కలు కత్తిరించి గోడల్లాపెంచిన క్రోటన్స్ పొద , మధ్య ఎడతెగని దారులతో ఉండేపార్కు అన్నమాట. లోపలి కెవరైనా వెడితే ఆదారుల్లోపడి తిరిగి బైటపడ్డం ఒక ఆటలా వినోదంగా వుంటుంది. ఆవ్యూహంలో పడి పైకిరాలేక చిక్కుపడుతున్న ఒకడికి దారి చూపించడంకోసం హారిస్ ఒకసారి వెళ్లాట్ట. ముందుగా పార్కుమాప్ అంతా ఒకసారి క్షుణ్ణంగా చూశాడు. చూస్తే ఇట్టే బైటపడచ్చుననే అనిపించింది వాడికి. ఈమాత్రం దానికి రెండుపెన్నీలు తగలేసి ఇంత్తోటి పార్కుమాడ్డం తెలివి తక్కువనిపించిందిట. తరవాత అనుకున్నాడు, ఈమాప్ ఎవరో దగాకోరు తనలాటివాళ్ల నేడిపించడానికి తయారుచేశా రేమోనని. మాప్కీ పార్కుకీ అసలుపోలికే లేదుట—పైగా తప్పుదారు పట్టించింది

పల్లెటూరు నించి హారిస్కి వరసకి తమ్ముడైనవాడొచ్చాడు. "ఈపార్కులోకి పోదాం పద — ఇది కూడ చూశామని చెప్పుకోడానికే గాని, నిజానికిందులో భేదించలేని వ్యూహమేమీ లేదు. బయలుదేరింది మొదలూ ఎప్పుడూ కుడిపక్క దారి వెంబడి పోతుంటే సరి, పదినిమిషాల్లో బైటికొచ్చేసి కాఫీకి పోవచ్చు" అన్నాడు హారిస్ తమ్ముడితో.

ఇద్దరూ లోపలి కెళ్లగానే అక్కడ కొందరు తటస్థపడ్డారు. వాళ్లు అక్కడ గంటసేపట్నించి తిరిగి తిరిగి కాళ్లు పట్టుకూచున్నారు. ఓస్ బైటపడ్డం ఎంతసేపు తనతో రమ్మన్నాడు వాళ్లందర్నీ. అందరూ హారిస్ వెంటపడ్డారు.

మధ్యదారుల్లో మరి కొందరు అవస్థపడుతున్న వాళ్లు కనపడ్డారు. హారిస్ అందర్నీ తనవెంట రమ్మన్నాడు. మొత్తానికి అప్పటికి పార్కులో వున్న వాళ్లందరూ హారిస్ వెనకాల చేరారు. దారీ తెన్నూ తెలియక ఇంక బైటపడ్డం వొట్టిదని అన్ని ఆశలూ వొదులుకున్న వాళ్లకి హారిస్నీ వాడివెనకాల గుంపునీ చూసేసరికి ప్రాణం లేచివొచ్చినట్లయింది. మొత్తం అంతా ఇరవైమందిదాకా ఉంటారన్నాడు హారిస్. అందులో చంటిబిడ్డని చంకనేసుకుని పొద్దుటినించీ తిరుగుతున్న ఒకతల్లి తప్పిపోతుందనే భయంతో హారిస్ చెయ్యి గట్టిగా పట్టువొదలకుండా పట్టుకుంది.

హారిస్ కుడిపక్కదారు లందుకుంటూ నడుస్తూనే వున్నాడు. చాలసేపు నడిచారు. చాలా దూరం వుందనుకున్నారు. "చాలా పెద్ద పార్కల్లే వుందే" అన్నాడు హారిస్ తమ్ముడు.

'అబ్బొ యూరప్లో ఇంతపెద్ద పార్కు ఇంకోటి లేదు" అన్నాడు హారిస్.

"అవునవును. పెద్దదే అయుంటుంది" అన్నాడు తమ్ముడు "ఇప్పటికి రెండుమైళ్లు నడిచివుంటాం"

హారిస్కి చిత్రంగావుందే అని తోచింది. అయినా అనుమానించకుండా నడుస్తూనే వున్నాడు. దారిలో ఒకచోట బిస్కట్ముక్క కనపడింది. అది పదినిమిషాల కిందట చూసిందే నంటాడు తమ్ముడు. కాదంటాడు హారిస్. బిడ్డ నెత్తుకున్న తల్లి పది నిమిషాల కిందట, తనే ఆబిస్కట్ముక్క పారేసినట్లు తేల్చింది. ఆవిడ ఉక్రోషాని కింక అంతులేదు. హారిస్ ఎక్కడ పోగైనాడో తన కర్మానికి, అని తిట్టిపోసింది. హారిస్కి పిచ్చెత్తినట్టయింది. కోపంతో మాప్ విప్పి

చూపించాడు. తన ఉపాయంలో తప్పు లేదని వాదించాడు.

"మాప్‌లో తప్పేం లేకపోవచ్చు లెండి" అన్నాడు ఒకడు. "కాని ఇందులో మనం ఇప్పుడెక్కడున్నట్టూ అనీ?"

అది హారిస్‌కీ తెలియదు. ఇంక వొచ్చిన దారినే వెనక్కి వెళ్లాలనుకున్నారు. అందరూ సరేనంటే సరే నన్నారు. హారిస్ ఎడమపక్క దారులవెంబడి నడిచాడు. అందరూ వాడివెంట నడిచారు. పది నిమిషాలు దాటేసరికి వచ్చినదారి తెలీలేదు కాని పార్కుమధ్య కొచ్చివున్నారు. అసలిక్కడికి రావాలనే తీసుకొచ్చానని మొదట హారిస్ దబాయించబోయాడు. కాని వెనకాల జనం తరహా చూసి ప్లేటు మార్చుకున్నాడు.

పోనీ మళ్లీ మాప్‌నిబట్టి దారి వెతుక్కోడానికి ఆధారం ఒకటి దొరికింది అంతే చాలనుకున్నారు. మాప్ చూస్తే అసలు చిక్కే లేదనిపించింది. వెంటనే బయలుదేరారు మళ్ళీ. కానీ మూడు నిమిషాల్లో మళ్లీ పార్కుమధ్యలో ఉన్నారు!

ఇంక ఎటు వేపు వెళ్లడానికీ తోచింది కాదు. ఎన్నిసార్లు ఎన్నిదార్లుపట్టి వెళ్లినా మధ్య కొచ్చేస్తున్నారు. చివరి కిల్లాగా ఈచోటు తప్పదనుకొని కొందరు కాళ్లుపీకినవాళ్లు అక్కడే కూలబడి దారి వెతుకుతున్న వాళ్లకోసం కనిపెట్టుకూచున్నారు.

హారిస్ మళ్లీ మాప్ తీశాడు. ఈమాటు మాప్‌ని చూస్తే జనానికి ఒళ్లు మండుకొచ్చింది. తీసికెళ్లి తలకి చుట్టుకోమన్నారు హారిస్‌ని. హారిస్ పరపతి పూర్తిగా తుడిచిపెట్టుకు పోయింది.

అందరికీ తిక్కరేగింది. గుమిగూడి కూచుని రాగవరసలో పార్కు కీపర్ కోసం అరవడం మొదలెట్టారు. కీపర్ పార్కుగోడకి నిచ్చెనేసి దానిమీద నుంచుని పలికాడు. బిగ్గరగా దారిచెప్తూ చేత్తో కూడా చూపడం మొదలెట్టాడు. అందరూ బిలబిలమంటూ తలోదారినా పడి రభస చేశారు. కీపర్ చెప్పేది ఒక్కళ్లకీ అర్థం కాకుండాపోయింది, "ఇదా అదా" అంటూ వీళ్లరవడం "అదికాదు ఇది" అంటూ కీపర్ అరవడం. ఏదీ తేలక జనం మళ్ళీమళ్ళీ కేకలు పెట్టడం ఇదీ వరస.

చివరికి విసుగెత్తి కీపర్ అందర్నీ ఎక్కడివాళ్ల నక్కడ నుంచోమని అరిచాడు. నుంచుంటే తనే వొచ్చి స్వయంగా దారి చూపిస్తానని చెప్పాడు. అందరూ ఒకచోట చేరి కీపర్ కోసం కాచుకూచున్నారు. కీపర్ తల పొదల్లో దూరిపోయింది.

కీపర్ కొత్తగా వొచ్చినవాడు. యువకుడు. పార్కు ఇంకా సరిగ్గా పరిచయం కాలేదు. వాడుకూడా పొదలమధ్య ఆరట్లాడటం మొదలెట్టాడు. అడపాదడపా పొదలసందున కనపడతాడే కాని వీళ్లదగ్గిరికి రాలేదు. మొత్తానికి కొత్తకీపర్ కూడా వ్యూహంలో చిక్కబడ్డాడు. మాటిమాటికీ "ఎక్కడున్నారు మీరు?" అని అరుపులు మాత్రం వినపడుతున్నాయి. అందరూ తలోదిక్కూ చూస్తున్నారు.

చివరికి ఈపార్కుకి పాతకాపు అయిన ఇంకో కీపర్ వొచ్చేదాకా అందరూ ఇల్లా వుండవలసి వచ్చింది. వాడొచ్చి అందర్నీ క్షణంలో బైటికి తెచ్చాడు.

'భలే వ్యూహంలే' అంటాడు హారిస్. ఓ కాబ నించి తిరిగివొచ్చే దారిలో జార్జిని ఈ వ్యూహంలోకి పంపాలి అనుకొన్నాం కూడా.

(ఇంకా వుంది)

అప్పుడే డ్రామా రిహార్సల్సు రూములో కూర్చుని పాటలు పద్యాలు విని విసుగెత్తి అమృతాంజనం కోసం బయల్దేరి తలుపు తీసి మెట్లు దిగుతున్న పెద్దమనిషితో, అద్దె యిళ్ళకోసం తిరుగుతూన్న ఒక గడ్డపాయన ఇలా అన్నారు.

"ఏమండీ! అద్దెకిచ్చే పోర్షను ఏమైనా ఉన్నదా?"

"ఆ! విశ్వామిత్రుడి పోర్షను కోసం వెతుక్కుంటున్నారు లోపలకిపోండి!"

శ్రీ కె. రా. కా.

# అతని కంటె ఘనుడు

బెర్నార్డ్‌షా ఆంగ్ల కవులలో ప్రసిద్ధి చెందినవాడు. అసలు కవులంతా ఇతరులతో హాస్యరస ముట్టిపడునట్లు మాట్లాడతారు. అలాగే యీయన కూడాను.

ఒకరోజు ప్రొద్దుటనే బెర్నార్డ్‌షాకు లేవబుద్ధి వేయలేదు. ఒంట్లో బాగులేక, అలానే మంచంమీద పండుకుని డాక్టరుకోసం కబురంపించాడు. డాక్టరు కూడ త్వరగానే వచ్చాడు.

డాక్టరు షాఉన్న గదిలోనికి రొజుకుంటూవచ్చి, పెద్ద ఆడంబరంగా ముఖాన్ని చేరుమాలుతో తుడుచుకుంటూ యిలా అన్నాడు– "అబ్బ! మీ మేడ మెట్లెక్కడం చాలా కష్టంగా ఉందండి! క్రిందనుంచి పైకి ఎక్కేసరికే శరీరమంతా ఎంతో అలిసిపోయింది"

డాక్టరు గారు అలసిపోవడం చూచి షా చాలా మృదువుగా 'కుర్చీలో కూర్చుండు'మని సంజ్ఞ చేశాడు. కొంతసేపటివరకు గదంతా నిశ్శబ్దంగా ఉంది. ఇంకా డాక్టరు ముఖం తుడుచుకుంటూనే ఉన్నాడు.

"తల నొప్పిగా ఉందా?" అని షా అడిగాడు.

"అవును ఈ వెధవనొప్పి నన్ను బాగా బాధిస్తుంది. బహుశా ఈ సమయంలో మీ మేడ మెట్లెక్కినందుకై ఉంటుంది" అని బదులు చెప్పాడు డాక్టరు.

దానిమీదట బెర్నార్డ్‌షా ఒక్కసారి మంచంమీద నుంచి లేచాడు. తిన్నగా మందులున్న పెట్టెదగ్గరికి వెళ్ళి ఏదోఒక మాత్ర తీశాడు. దానిని ఒక గ్లాసెడు నీళ్ళలో వేసి కలిపి, గ్లాసును డాక్టరు కందిస్తూ అన్నాడు–"దీన్ని తీసుకుని త్రాగండి మీకు తప్పకుండా లాభం కలుగుతుంది"

రోగి వెంటనే తీసుకుని త్రాగేశాడు. రెండు మూడు నిమిషాలు గడిచినతరువాత "ఏం? ఎలాఉంది" అని అడిగాడు షా.

"తగ్గిపోయింది. చాలా ధన్యవాదాలు" అన్నాడు డాక్టరు.

**శ్రీ దొంతంశెట్టి వీరభద్రరావు**

షా తనగదిలో అటు యిటు పచార్లు చేయడం మొదలెట్టాడు. తరువాత ఒక్కసారి ఆగిపోయి అన్నాడు–"డాక్టరుగారూ! మీ తలనొప్పికి, అలసిపోవడానికి కారణము ఈ మెట్లెక్కడం కాదనుకుంటున్నాను"

"అయితే మరి?"

"ఎక్కువ పుష్టికరఆహారం తినడంవల్లనే అయివుంటుంది. మీరు అంతంత మాంసం ఎందుకు తింటారు?" (పశ్చిమ దేశాల్లో ఆహారంగా మాంసాన్నెక్కువగా వాడుతుంటారు)

"అయితే మరేం తినమంటారు?" అని ఆశ్చర్యపోతూ అడిగాడు డాక్టరు.

"పళ్ళు, కాయగూరలు తినండి. సరే, యిప్పుడు తమరి వయస్సెంత?"

"ముప్ఫయ్యేళ్ళుంటాయి"

"అయితే తమరు తప్పకుండా సిగ్గుపడాల్సినమాట నన్ను చూడండి. మీకంటె రెట్టింపు వయస్సు పైగా ఉంటుంది. కాని మీకంటె రెండు రెట్లు చురుకుగా ఉంటున్నాను"

తరువాత బెర్నార్డ్‌షా తను రోగులకు సరిగా చికిత్స చేయడం లేదనీ, అప్పుడప్పుడు ఒకటికి బదులుగా మరియొకటి చేస్తూంటారని డాక్టరుకు తెలియచెప్పాడు.

"అవును, మిష్టర్ షా! మూర్ఖత్వం వల్ల అప్పుడప్పుడు మీరంటున్నట్లుగానే చేస్తుంటాం" అని అంగీకరించాడు డాక్టరు.

"మీవంటి మనుష్యులు చాలా జాగ్రత్తగా ఉండాలండి డాక్టరు గారు! మీరు నాట్యం చేయగలరా?" (నాట్యంచేయడం వాళ్ళ దేశంలో ఒక సరదా)

"చేయలేనండీ" అన్నాడు డాక్టరు.

బెర్నార్డ్‌షా ఆక్షణమే గ్రామఫోను తీసి ఒక (Music Record) సంగీతపు రికార్డు పెట్టి అద్భుతంగా నృత్యప్రదర్శన చేశాడు. తరువాత డాక్టరుతో అన్నాడు–

"మీరు రోజూ ప్రొద్దుటే కొంత సేపిలా నాట్యంచేసినట్టయితే నాలాగా చురుకుగా ఉండగలరు... ఆఁ, నేను మీకు సలహాయిచ్చాను. దానికి ఐదు షిల్లింగులు (ఒక షిల్లింగు మూడు పావలాలు) ఫీజు యిలా యివ్వండి"

"క్షమించండి, మిస్టర్ షా, నా ఫీజు రెండుపౌన్లు (ఒకపౌను పది హేను రూపాయిలు) మీరు యివ్వవలసి ఉంది"

"కాని రోగి మీరే అయినా రండి డాక్టరుసాబ్"

"అది కాదండి అసలు సంగతి, నేను చికిత్స చేసే విధమే యిది. నేను రోగియింటికి వెడితే, నేనే జబ్బుపడినట్లుగా నటిస్తాను. అప్పుడా రోగి తన జబ్బంతా ఎక్కడికో పారిపోయి, నాకు వైద్యం చేయడంలో నిమగ్నులౌతారు. ఇప్పుడు తెలిసిందా?"

బెర్నార్డ్‌షా [illegible] విని, మాట్లాడకుండా మూడు పౌన్లకు చెక్కు వ్రాసియిస్తూ యిలా అన్నాడు - "కనీసం నేను చేసిన నాట్యప్రదర్శనానికైనా మీరు ఫీజు చెల్లించవలసి ఉంది. అయినా ఇంతవరకూ నేను ఇతరులతోనే హాస్యపరిహాసా లాడుతుండేవాడిని. కాని ఇప్పుడు మీ చేతిలోనే మోసపోయాను. తెలుసుకోండి, అందువల్లనే మీకింకా ఎక్కువ ఫీజిస్తున్నాను." ★

# మార్కుల వేట

**"రాధానాధ్"**

అప్పావధానులు శుద్ధ శ్రోత్రియ బ్రాహ్మడు. నిగనిగలాడే నున్నటి గుండు, దేవతార్చనానంతరం పూలతో అలంకరింపబడ్డ పిలక, దేదీప్యమానంగా వెలుగుతూండే గంధాక్షతలు, మెళ్ళో తాటికాయలంత నల్లని రుద్రాక్షలు చూస్తేనే తెలిసిపోతుంది అవధానులు శుద్ధ సనాతనుడని. వేదం నాలుగు పన్నాలు క్షుణ్ణంగా అప్పచెప్పగల సమర్థుడు. అందువల్లే ఆయనంటే ఆ గ్రామంలో పలుకుబడీ, గౌరవం వున్నాయి. ఏ శుభ కార్యమైనా, శ్రాద్ధ కర్మలయినా చేయించవలసివస్తే తప్పక అప్పావధానుల గారిని పిలవవలసిందే! కాఫీహోటలులో పదార్థాల రేట్లమాదిరిగా బోర్డుమీద రాసి కట్టకపోయినా పెళ్ళికి నూటపదహార్లనీ, శ్రాద్ధానికి అర్ధనూటపదహార్లనీ మామూళ్ళలవాటు చేసేశాడు. ఇంత శుద్ధ వైదీకి అయినా తెలివి తేటలకు మాత్రం లోపంలేదు: ఏ ఎండ కాగొడుగు పట్టగల సమర్థుడే.

అవధానుల గారికి లేక లేక కలిగాడు రామావధాని. తన మాదిరిగా వేదం చదవడం యిష్టం లేక మొదటినుంచీ వాటి జోలికే పోనివ్వకుండా ఇంగ్లీషు చదువులో ప్రవేశపెట్టాడు. గారాబం జాస్తయి చదువేమీ వొంట పట్టడంలేదు. తిండిమీద వున్న ఆసక్తి చదువుమీద వుంటే పాపం పరీక్షలు పాసవడానికి అంత కష్టం ఉండకపోను! అవ్వాళ్లో స్కూల్లో థర్డుఫారం వరకు ఎలాగైతేనేం తన పలుకుబడినంతా వినియోగించి పాస్ చేయించాడు రామావధాన్లని. సరే! పైచదువుకు దగ్గర్లో వున్న పట్నం పంపించాడు. పట్నం వెళ్లగానే వున్న పిలక కాస్తా తీయించి క్రాపు పెట్టించాడు. నిక్కర్లు మానేసి పాంట్లు, అరచేతుల చొక్కాలకు బదులు ఫుల్‌షర్ట్లు మంచి నాజూగ్గా తయారయ్యాడు. పేరుకూడ మార్చేశాడు. 'రామశాస్త్రి' అని. ఇన్ని మారినా చదువులో మాత్రం మామూలు తప్పలేదు. ఫోర్తుఫారం రెండేళ్లు ఫిఫ్తుఫారం రెండేళ్లు ఢింకీ కొట్టి ఎల్లాగైతే నేం వచ్చాడు స్కూల్ ఫైనల్‌లోకి. ఈ చదువు, ఈ తెలివి తేటలు చూసి, ఎల్లాగైనా కొడుకును బి. ఎ. అని అనిపించాలని సరదాపడుతున్న అప్పావధాన్లు గారికి చాలా విచారం కల్గింది. కాని ఏం చేస్తాడు! తన చేతుల్లో వుంటేగా!

స్కూల్ ఫైనల్ పరీక్షలుగూడ అయిపైనె. రామశాస్త్రి యింటికొచ్చాడు శలవలకు. రాంగానే అడిగాడు కొడుకుని "ఏంరా! ఎలా రాశావు. పరీక్షలు" అని అప్పావధాన్లు.

"బాగానే రాశాను నాన్నా" అన్నాడు రామశాస్త్రి మామూలుగా. 'లెక్కలు గూడ బాగా రాశావా' అని అడిగాడు కొడుకు తెలివితేటలు లెక్కలలో శూన్యం అని తెలుసు కాబట్టి. 'అదే కొంచెం అనుమానం నాన్నా! ఆ పేపరు దిద్దే మేష్టారు కనికరిస్తే పాస్ అవచ్చు' అని చల్లగా చెప్పాడు.

ఇంక అప్పావధాన్ల గారికి ఒకటే ఆలోచనలు, కొడుకును ఎట్లా పాస్ చేయించటం అని. ప్రయత్నంచేసి కనుక్కోగలిగాడు; ఆ లెక్కలు పేపరు దిద్దేది నెల్లూరు హెడ్ మాష్టరుగారని.

సరే! మర్నాటికల్లా అవధాన్లు గారు నెల్లూరులో వాళ్ల బంధువులింట్లో మకాం వేశాడు. యిక ఆ హెడ్‌మాష్టరు గారిని గురించి వాకబు చెయ్యడం మొదలెట్టాడు. ఆ హెడ్‌మాష్టరు గారు చాల కర్కోటకుడనీ, ఇంటికి బయట తాళంపెట్టి వంటయింట్లో కూర్చుని పేపర్లు దిద్దుతాడనీ, చివరకు స్వంత కొడుకైనా మార్కులు వేయడనీ తెలిసేటప్పటికి చాల విచారించాడు అవధాన్లుగారు. ఇంకా వాకబు చేయగా తేలిందేమంటే ఆ మాష్టరు గారు శిష్టాచార సంపన్నుడనీ

అతిథి అభ్యాగతులను గౌరవిస్తాడనీ తెలిసింది. ఇంకేం మన పాచిక పారిందనుకున్నాడు అవధాన్లుగారు.

మర్నాడు ప్రొద్దున్నే స్నానం చేసి విభూతిపెట్టి, మెళ్లో రుద్రాక్షలు వేసుకొని బయలుదేరాడు మాష్టరుగారింటికి. అవధాన్లుగారు వెళ్ళేటప్పటికి హెడ్‌మాష్టరు గారు అప్పుడే సంధ్యావందనం ముగించి భగవద్గీత పారాయణం చేస్తున్నారు. అవధాన్లుగారు వెళ్లడంతోటే నమస్కార బాణం ఒకటి పారేసి తాను యాత్రార్థం వచ్చినట్లు ఆపూట అక్కడే దేవతార్చనకు ఏర్పాటు చేయవలసినదిగాను కోరాడు. సరేనన్నారు మాష్టరుగారు. తరువాత భగవద్గీత శ్లోకాల మీద, వేదాలమీద, పురాణాల మీద సమగ్రమైన చర్చలు జరిగినై—

పదిగంటలవడంతోటే మడి కట్టుకోవచ్చని లోపలనుంచి పిలుపు వచ్చింది. ఇద్దరూ మడిగట్టుకొని పీటలమీద కూర్చుని జపం మొదలెట్టారు. తొందరగానే ముగించారు ఆరోజు జపం మాష్టరుగారు స్కూల్లో పనివుండటంవల్ల. వారు ముగించడంతోటే అవధాన్లుగారు కూడ ముగించారు జపం. వడ్డన పూర్తిఅవడం అభికరించడం కూడ అయిపోయింది. ఇంక కూర్చోవచ్చని అవుపోసన పట్టపోతూ ప్రక్కకి చూచారు అవధాన్లగారి వైపు హెడ్‌మాష్టరుగారు. కాని అవధాన్లుగారు ఆ ప్రయత్నంలో లేరు-

“కానివ్వండి. నాకు మళ్ళీ కాలాతీతం అవుతోంది” అన్నారు మాష్టరు గారు.

‘కా...నిస్తాను లెండి’ అంటూ సంకోచిస్తూ అన్నాడు అవధాన్లు గారు.

మాష్టరుగారికి ఆశ్చర్యం వేసింది. ఏమైనా లోపం చేశామేమో, అన్నీ వడ్డించారోలేదో! అని చూశారు. అన్నీ వడ్డించేవున్నయ్.

‘కానివ్వండి...ఏదో ఆలోచిస్తు

(౫౬-వ పేజీ చూడండి)



# అక్షయ కాలంనాటి పాత్ర

మూలం :
పూర్ణానంద వర్మ

అనువాదం :
శ్రీ జి. సీతారామశాస్త్రి

లాలా ఝూవూలాల్‌కు అన్న వస్త్రాలలో లోటులేదు. కాశీలో కంచర బజారులో ఇల్లు ఉన్నది. క్రిందిభాగంలో ఉన్న దుకాణాలమీద నెలకు ఒక నూరు రూపాయిల అద్దె వస్తుంది. పిల్లా జల్లా యింకా కల్గలేదు. యిద్దరికే అయ్యేఖర్చు అంతా. బాగా తింటూ తిరుగుతూ హాయిగా ఉన్నారు. కాని ఒక్కసారి అయినా కంటికి చూద్దామంటే రెండువందల యాభై రూపాయిలు ఉండటంలేదు.

అందుచేత ఒకరోజున అమాంతంగా రెండువందల యాభైరూపాయిలు కావాలని భార్య అడిగేసరికి అతనికి గుండెలో దడ బయలుదేరింది. ఏదో కొంప మునిగేటట్లుగా కనపడింది. భార్య యీ కంగారు అంతా చూచి "భయపడకండి, మీ చేత లేదంటే మాఅన్నయ్యను అడిగి తీసుకుంటాను" అన్నది.

లాలాజీకి మెత్తని చెప్పుతో కొట్టినట్లైంది. వెంటనే మేకపోతు గాంభీర్యం ధరించి తీవిగా సరసంలోకి దింపాడు... "పోదువూ... ముష్టి రెండువందల యాభైరూపాయిలకోసం మీఅన్నయ్యను బిచ్చమడుగుతావా? కావాలంటే నేనే ఇస్తాను"

"నాకు యీభూలోకంలో యీ దేహంతో ఉండగా కావాలి"

"అది అంతా ఎందుకు సప్తాహం గడిచే సరికి నీకిచ్చేస్తాను"

"సప్తాహం అంటే మీ తాత్పర్యము ఏడురోజులా? లేక ఏడు సంవత్సరములా!!!

లాలాజీ మీసం దువ్వుకుంటూ తీవిగా అన్నాడు - "నాదగ్గరనుంచి ఏడవరోజున నీవు రెండువందల యాభై రూపాయలు తీసుకొనగల దానవు"

"మొగవాళ్లది ఒకటేమాట"

"అవునండి. మొగవాళ్లకు ఒకటేమాట: అంటే తిరుగులేదు" అంటూ నడకలో అచ్చమైన మొగవాడినని చూపుతూ అవతలికి వెళ్లాడు.

కాని నాల్గురోజులయింది. ఎక్కడ డబ్బు పుట్టలేదు. విచారంతో కృంగిపోసాగాడు. పరువు మర్యాద గౌరవంతో కూడిన సమస్య తనయింట్లో తన గౌరవానికి సంబంధించిన సమస్య. యిస్తానని గట్టిగా వాగ్దానంచేసి మాట తప్పితే భార్య ఏమనుకుంటుంది? ఆమెదృష్టిలో అతనికి ఏమివిలువ ఉంటుంది? యిదివరకే తననుగురించి ప్రశంసనీయమైన సంగతులు అనేకము చెప్పి ఉన్నాడు. నోరుతెరచి రూపాయల విషయం అనటం ఇదే మొదటిసారి. ఇపుడు తోకముడిచాడా మళ్ళీ ఏముఖం పెట్టుకుని భార్యను చూడగలడు "మొగవాడిదిఒకటేమాట"...యీ అంశము చెవులలో మ్మోరు మ్రోగుతున్నది.

ఇట్లా అనుకుంటూ ఉండగా ఇంకొకరోజు గడచిపోయింది. అయిదవరోజున భయపడి యీసంగతి అంతా తన స్నేహితుడైన బిల్వానీమిశ్రాకు వినిపించాడు. కాలం ఖర్మం చాలక పొయ్యేసరికి బిల్వానీ దగ్గర కూడా మొండిచెయ్యి ఎదురైంది. తనదగ్గర లేకపోయినప్పటికి స్నేహాని కోసము ఎక్కడైనాఅడిగిగాని, తల తాకట్టు పెట్టిగాని తేవటానికి ప్రయత్నిస్తానని అన్నాడు. దొరికినట్లయితే రేపు సాయంత్రం మీయింటికి వచ్చి యిస్తానన్నాడు.

వారం రోజులు గడువు అయిపోయింది. సాయంత్రంవేళ అయింది. తెల్లవారే సరికి రెండువందల యాభై రూపాయిలు లెక్కపెట్టాలి లేదా తన గౌరవమర్యాదలకు తిలోదకాలు వదులుకోవాలి. రేపు డబ్బు ఇవ్వనంత మాత్రాన అతనిని అతనిభార్య ద్వీపాంతర వాసానికి పంపదు. ఉరిస్తంభం ఎక్కించదు. ఇంతలో ప్రాణం తియ్యదు. కానీ

ఎగతాళి చేస్తుంది. కాని అది ఎట్లాంటి ఎగతాళి అయిఉంటుంది. అది తల్చుకుంటుంటేనే గుండె కంపరం పుచ్చుకుంటున్నది.

ఇంతవరకు పండిత్ బిల్వాశి మిశ్రా రాలేదు. ఇవ్వాళ్ల సాయంత్రం రావల్సినరోజు. అతనిమీదే అన్ని ఆశలుపెట్టుకొని ఉన్నాడు. ఒకవేళ రాకపోయినట్లయితే? ఎక్కడ రూపాయలు అతను సాధించలేక పోయినట్లైతే?...

ఇదే ఆలోచనలో మునిగి మేడ వరండాలో లాలాజీ పికార్లు కొడుతున్నాడు. కొంచెం దప్పిక అయినట్లనిపించింది. వెంటనే నౌకరును పిల్చాడు. నౌకరు ఇంట్లో లేదు. శ్రీమతిగారు స్వయంగా నీరు తీసుకొని వచ్చింది. హిందూ సమాజంలో స్త్రీ-యొక్క శోచనీయమైన విషాదపరిస్థితి మీకందరికి తెల్సిందే కదా! భర్త దప్పికగొంటే పాపం భార్య నీళ్లచెంబులో తీసుకొనివచ్చి వెంటనే హాజరు కావాల్సిందే కదా...



మెనీళ్లయితే తీసుకవచ్చింది కాని గ్లాసు తీసుకరావటం మరచిపోయింది. మామూలుగా ఒక్క చెంబుతో మాత్రం నీరు తీసుకొని హాజరైంది. ఆ చెంబు అయినా ఎట్లాంటిది? దాని వికార స్వరూపం చూస్తేనే ఎప్పుడు లాలాజీకి ఒళ్లు మంట. చెంబు కొత్తదే. తయారు చేయించి కూడా రెండు సంవత్సరాలు దాటలేదు. కాని దాని అవతారం చూస్తే తండ్రి వినాయకుడు తల్లి ఒక నడ్డిది అయిఉన్నట్లుంది.

లాలాజీ మాట్లాడకుండా చెంబు తీసుకున్నాడు. అతను భార్యమాట జవదాటడు. అసలు జవదాటటానికి వీలులేదు. దీనినే ఇవ్వాళ్ల సభ్యత అంటారు. ఏపతి అయితే తనపత్నికి పత్నికాడో వాడు అసలుపతి ఎట్లా అవుతాడు? మళ్ళీ చెంబులో నీళ్లు మిగిల్చితే ఏమితప్పో అని కూడా ఆలోచించాడు. క్రింద పారబోస్తే భోజనం చేసేటప్పుడు తడిగా ఉంటుంది. చెంబు చూద్దామా, చాలా బరువుగా ఉంది. విపరీతంగా కోపం వచ్చింది.

కాని ఏం చేస్తాము? కోపం దిగమ్రింగి నీళ్లు తాగటానికి ఉపక్రమించాడు. ఆసమయంలో లాలాజీ

# ★ అక్బరు కాలంనాటి పాత్ర ★

వరండాలో ఉన్న మొండిగోడ (మేడయొక్క పిట్టగోడ)కు ఆనుకొని ఉన్నాడు. మన పెద్దలు నీళ్లు త్రాగేవిషయమై కొన్ని నిబంధనలు ఏర్పరిచినారు. నుంచొని త్రాగకూడదని, పడుకొని త్రాగకూడదని, పరుగెత్తివచ్చిన వెంటనే త్రాగకూడదని. కాని మేడమీద వరండాలో పిట్టగోడకు ఆనుకొని నుంచుంటూ నీరు త్రాగకూడదని అన్నట్లులేదు. ఇల్లాంటి విషయం -మహాత్వ పూర్ణమైన విషయమై- ఆలోచించే సమర్థత బహుశా వారిలో లేదేమో!

అందుచేత లాలాజీ వరండాలో పిట్టగోడకు ఆనుకొని మంచినీళ్లు త్రాగటం తప్పుకాదనుకుంటాను. కాని అతి కష్టంమీద రెండుమూడు గుటకల నీరు త్రాగాడు. తరవాత మరి ఎట్లా చెయ్యిజారిందో, ఎట్లా చెయ్యి విడిచి పెట్టాడో...

చెంబు ఎడమ చేతిలో కనపడలేదు. అది క్రిందఉన్న ఒక సందులోకి వెళ్లిపోయింది. ఆవేగంచూస్తే ఉల్క చుక్కలకు సిగ్గువేస్తుంది. కళ్లు మిరుమిట్లు గొల్పినై. అవ్వు డెప్పుడో న్యూటన్ మహాశయుడు భూమికి ఆకర్షణశక్తి ఉన్నదని కనుక్కున్నాడుట. యీశక్తి సాంతం యీసారి చెంబువైపుకే తర్లిందని వేరే చెప్పనక్కరలేదు.

లాలాజీ మొహంలో కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు. కంచరి బజారులో, అటూ ఇటూ జనసంచారం జరుగుతుంటే, ఎత్తు అయిన మూడు అంతస్థుల మేడమీదనుంచి నిండు చెంబు క్రింద పడటమంటే ఏమి నవ్వులాటకాదు. ఈ చెంబు ఎవరి బుర్ర రామకీర్తనం పాడించి వైకుంఠ యాత్రకు పంపించిన సంగతి తీసుకువస్తుందో?

చూఛాయగా అట్లాగే జరిగింది. బజారులో కోలాహలం బయలుదేరింది. లాలాజీ క్రిందకు దిగివచ్చేసరికి అరుగులనిండా జనం గుమ్మికూడి ఉన్నారు.

జనసమ్మర్దంలో ప్రధానపాత్ర వహించింది ఒక తెల్లదొరగారు. ఆపాదమస్తకం అభిషేకం జరిగినట్లుంది. ఒక కాలును చేత్తో సద్దుకుంటూ రెండవకాలుమీద నాట్యం చేస్తున్నాడు. ఆయనదగ్గరే అపరాధం చేసిన చెంబు తలవంచుకొని ఉండటం చూచి రెండు రెండు కల్పితే నాల్గుగదా అని నిర్ణయించుకున్నాడు. పూర్తి వివరాలు తరువాత ఆయనకు తెల్సినవి.

జరిగిన సంగతేమంటే చెంబు క్రిందపడటానికి పూర్వము మూడవ అంతస్తునుంచి జారి రెండవ అంతస్తుమీద పడి ఆగింది. అక్కడ ఆగి క్రింద దుకాణంలో నుంచొనిఉన్న తెల్లదొరవారిని స్నానం చేయించింది. తరువాత జారి ఆయనబూటుమీదపడింది. ఇక్కడ తెల్సుకోవల్సిన ముఖ్యమైన విషయము ఏమంటే హిందూస్తాన్ మనుష్యులు ఎక్కడైతే జారి పడుతుంటారో అక్కడే హిందుస్తానీ చెంబుకూడా పడింది.

ఎప్పుడైతే యీ చెంబుయొక్క యజమాని లాలాజీ అని తెల్సుకున్నాడో తెల్లదొరగారు ఒక పని చేశాడు. నోరు బాగా విస్తరింపజేసి ఇక మొదలుపెట్టాడు. లాలాజీ, ఇంగ్లీషు భాషలోకూడా తిట్లుఉంటవని ఇవ్వాళ్ళే తెల్సుకున్నాడు.

ఇదేసమయంలో బిల్వాశీమిశ్రా గుంపును చీల్చుకొని రావడం కనపడ్డది. అతను రాగానే తెల్లదొరగారు తప్ప మిగతావాళ్లు ఎంతమంది ఉన్నారో అందరిని బయటకు పంపించాడు.

ఒక కుర్చీ అక్కడ పెట్టి "బహుశా మీకాలుకు బలమైన గాయం తగిలినట్లున్నది కుర్చీమీద కొంచెంసేపు విశ్రమించండి" అన్నాడు.

దొరగారు బిల్వాశీగార్కి ధన్యవాదా లర్పిస్తూ కూలబడ్డారు. లాలాజీవేపు చూపించుతూ మీకు ఈవ్యక్తి తెలుసునా అని అడిగాడు.

"నాకు ముక్కు మొహం తెలియదు. పైగా బజారునపోయ్యే వాళ్లమీద అనవసరంగా నీళ్లు పోసే వాళ్లని తెలుసుకోవలసిన అగత్యం లేదు. నా ఉద్దేశ్యంలో వీడిది ప్రమాదమైన పిచ్చి."

"కాదుకాదు నా ఉద్దేశ్యంలో వీడు దూరంగా ఉంచవలసిన మనిషి"

భగవంతుడు ఝూమ్రూలాల్ కళ్లకు చూసే శక్తే కాకుండా ఎదటివాళ్లను తినివేసే శక్తికూడా యిచ్చి ఉంటే యీసమయంలో బిల్వాశీ మిశ్రాను నమిలి మింగేశి ఉండేవాడు.

"ఇప్పుడు ఏం చెయ్యమంటారు?" అని తెల్ల దొరగారు బిల్వాశీ మిశ్రను అడిగాడు.

"యీవిషయాన్ని పోలీసులకు రిపోర్టు చెయ్యండి. వెంటనే వాళ్లు విచారిస్తారు."

"పోలీసు స్టేషను ఎక్కడ?"

"దగ్గరే ఉన్నది. నేను చూపిస్తానురండి"

"పదండి"

"ఇప్పుడే వెళ్లుదాము. కాని తమతో ఒక మనవి. మీ అనుజ్ఞ అయినట్లైతే యీ చెంబును నేను కొనుక్కుంటాను. (లాలాజీ వేపు తిరిగి) "యీ చెంబు అమ్ముతారా!

# ★ అక్బరు కాలంనాటి పాత్ర ★

యాభై రూపాయలకు యిచ్చినట్లయితే తీసుకుంటాను"

లాలాజీ మాట్లాడలేదు. కాని దొరగారు "యీ పనికిరాని చెంబుకు యాభైరూపాయిల ధర యిచ్చి కొంటున్నారేమి?" అని అడిగాడు.

"మీరు దీనిని పనికిరాని చెంబు అంటున్నారేమి? చాలా ఆశ్చర్యమైన మాట. నేను మిమ్మల్ని చూచి బాగా చదువుకున్న సుశిక్షితు లనుకున్నాను."

"అసలు సంగతేమిటో కొంచెం చెప్పండి."

"ఇది ఒక చారిత్రాత్మకమైన చెంబు. ఇది అక్బరు చెంబు. ఇంత ప్రసిద్ధికెక్కిన చెంబు కొరకు ప్రపంచములో ఉన్న మ్యూజియము లన్ని తహతహ లాడుతున్నవి."

"అంత గొప్పదా?" (ఆశ్చర్యంతో)

"అవును. ఇది పదహారవ శతాబ్ది నాటి విషయము. హుమాయూను షర్షా చేత ఓడించబడి పారిపోయి సింధూతీరములో ఉన్న ఎడారిలో తిరిగాడు. ఒకరోజున దప్పికవల్ల ప్రాణంపోయ్యే పరిస్థితి ఏర్పడింది. ఆ దేసమయంలో ఒక బ్రాహ్మణుడు ఇదే చెంబుతో నీరుయిచ్చి హుమాయూన్ ప్రాణాన్ని కాపాడినాడు. హుమయూన్ తర్వాత అక్బరు సింహాసనమును అధిష్టించినపుడు, అక్బరు ఆ బ్రాహ్మణుని పిలిపించి ఆ చెంబుకు బదులుగా పది అటువంటి బంగారపు చెంబులిచ్చి ఆ చెంబును కొన్నాడు. ఈ చెంబంటే అక్బరుకు ప్రాణంతో సమానము. అందుచేతనే దీనికి "అక్బరు చెంబు" అని పేరు వచ్చింది. ఇది 1657 వరకు రాజమహాలులోనే ఉన్నది. కాని తరువాత కనపడలేదు. కలకత్తా మ్యూజియములో ప్లాస్టరుతో తయారుచేసిన దీనిమాదిరి చెంబు ఒకటి ఉన్నది. యీ చెంబు యీ వ్యక్తిదగ్గరికి ఎట్లా ఎందుకు వచ్చిందో తెలియదు. మ్యూజియం యజమానులకి ఈ సంగతి తెల్సినచో ఎంత ఖరీదు అయినా యిచ్చి తీసుకుంటారు.

ఈవిషయం వినేసరికి దొరగారు మైకంలో పడిపోయినారు. కళ్ళు చక్రాలంత అయినవి. బిల్వాశీని ఈవిధంగా అడిగినాడు.

"ఈ చెంబు తీసుకొని మీరేమి చేసుకుంటారు?"

"నాకు పురాతనమైన ఇతిహాసమునకు సంబంధించిన వస్తువులను పోగు చెయ్యటం సరదా"

"నాకు కూడా అల్లాంటి సరదా ఉన్నది. యీ చెంబు నామీద పడక పూర్వము నేను అదే ప్రయత్నము చేస్తున్నాను. యీ దుకాణములో వెనుకటి కంచువిగ్రహాలను కొనుక్కుంటున్నాను."

"ఏదైనానరే. చెంబునుమాత్రం నేను కొనుక్కుంటాను."

"బాగుంది. మీరెట్లా కొనుక్కుంటారు? హక్కు నాకున్నది."

"హక్కు ఏమిటి?"

"అవును హక్కు నిజంగా ఉన్నది. చెంబు నీళ్ళలో మీరు స్నానం చేశారా? లేక నేనా?"

"మీరే."

"ఆ చెంబు నా కాళ్లమీద పడిందా? లేక మీ కాళ్లమీదా?"

"మీ కాళ్లమీదనే."

"నా వేలు విరగకొట్టిందా లేక మీ వేలా?"

"మీ కాలివేలే విరిగింది"

"అందుచేత దానిని కొనుక్కుండే హక్కు నాకు ఉన్నది."

"ఇదంతా బూటకము. వేలం పెట్టండి. ఎవరు ఎక్కువ ఖరీదు చెల్లించగల్గితే వారిది."

"మీరు యాభై రూపాయలు ఇస్తామన్నారు. నేను నూరు రూపాయిలు ఇస్తాను."

"నేను నూటయాభై రూపాయిలు ఇస్తాను."

"నేను రెండువందలు ఇస్తాను."

"అయ్యో! నేను రెండు వందల యాభై ఇస్తాను" అని అంటూ బిల్వాశీమిశ్రా రెండువందలయాభై రూపాయలు లాలాజీ ముందు విసిరి పడవేశాడు.

తెల్ల దొరగారిలో పౌరుషం పొంగి పొర్లింది. "నేను అయిదు వందలు ఇస్తాను" అని ముందుకు నాల్గడుగులు వేశాడు.

బిల్వాశీ చాలా విచారించుతూ క్రిందపడిన తన నోట్లను ఏరుకోవటం మొదలుపెట్టాడు. తెల్ల దొరగారి వేపు తిర్గి "మీరు చాలా అదృష్టవంతులు. చెంబు చివరకు మీకే దక్కింది" అని అభినందించాడు.

దొరగారి ముఖం సంతోషంతో విప్పారి చింపిరి చేటంత అయిందని వేరే చెప్పనక్కలేదు. చెంబు చేత పట్టుకొని యీవిధంగా అన్నాడు

"నేను మా దేశం ఇక సంతోషంగా వెళ్లుతాను. ఇంతవరకు మేజర్ డగ్లస్‌గారి కోతలతో చచ్చిపోతున్నాను"

"మేజర్ డగ్లస్ ఎవరు?"

"మేజర్ డగ్లస్ మా పొరుగున ఉండే గృహ యజమాని. ప్రాచీన వస్తువులను పోగుచేయటంలో మా ఇద్దరికీ పందెము. క్రిందటి సంవత్సరము ఇక్కడికివచ్చి "జహంగీరు గుడ్డు"ను తీసుకొని పోయినాడు."

"జహంగీరు గుడ్డు" అంటే ఏమిటండీ?

జహంగీరు నూర్జహానుతో ప్రేమ కలాపాలు జరిపేటప్పుడు పావుర సందేశం జరిగింది. నూర్జహాను అందులో ఒక పావురమును వదలిపెట్టింది. జహంగీరు అది ఎట్లా పోయింది అని అడిగితే రెండవ దానిని కూడా పైకి ఎగరవేసి ఇట్లా ఎగిరిపోయింది అని జవాబుఇచ్చింది ఆమెయొక్క ఆ మాయ కత్వపు తెలివితేటలు చూసి తన హృదయాన్ని ఆమెకు అర్పించి వేశాడు. ఆ పావురంవల్ల తనప్రేమ ఫలించుటచే పావురపు సహాయ జ్ఞాపకార్థం దానియొక్క గుడ్డును ఒకదానిని జాగ్రత్త చేశాడు. తరువాత అదే "జహంగీరు గుడ్డు" అని లోకప్రసిద్ధమైపోయింది. దానిని మేజర్ డగ్లస్‌గారు ఢిల్లీలో ఒక మహామ్మదీయ వృద్ధుని దగ్గర మూడువందల రూపాయలకు కొన్నాడు.

'అదా సంగతి!!!"

"కాని ఈ సంగతి తెలిస్తే నోరు కూడా మెదల్పలేడు. ఈ "అక్బరు చెంబు" ఆ "జహంగీరు గుడ్డు" కంటే ఒక శతాబ్దము పురాతనమైనది."

"దీనినిబట్టి చూస్తే మీ చెంబు ఆ గుడ్డుకు తండ్రి అవుతుంది."

దొరగారు లాలాజీకి అయిదు వందల రూపాయలు సమర్పించుకొని దారిపట్టాడు. లాలాజీగారి ముఖం ఇప్పుడు చూడవలసిందే కాని, చెపితే తీరదు. గడ్డంమీది ఆరుదినముల ప్రాయముగల రోమములు ఆనంద వీచికలలో ఓలలాడుతున్నవి...

"బిల్వాశీగారూ! నా కొరకు రెండు వందల యాభై రూపాయలు ఇంటిదగ్గరనుంచి తెచ్చినట్లున్నారు. మీదగ్గర లేవుకదా యిదివరకు."

"ఈ రహస్యము నాకు, భగవంతుడికి తప్ప ఇంకెవరికి తెలియదు"

"కాని మీరు ఎక్కడికి వెళ్లుతున్నారు. ఇంకా మీతో రెండు ఘంటల పని ఉన్నదే?"

"రెండు ఘంటలవరకా?"

అవును. మిమ్మల్ని శహబాస్ అని వీపు చరచటానికి ఒకఘంట. ధన్యవాదా లర్పించటానికి ఒక గంట.

కాని మొదలు మీ అయిదు వందలు లెక్కపెట్టి తీసుకోండి. తన డబ్బును తాను లెక్క పెట్టుకోవటంలో ఆనందమే కాకుండా తన్మయుడు కూడా అయిపోతాడు మానవుడు. లాలాజీ పని పూర్తి చేసుకొని పైకి చూచాడు. యీ మధ్యలో బల్వాశీ అంతర్ధానమైపోయినాడు. బారుఅంగలు వేసుకుంటూ బజారులో నుంచి వెళ్లుతున్నాడు.

ఆ రాత్రి చాలా సేపటివరకు బిల్వాశీకి నిద్రపట్టలేదు. దుప్పటి కప్పుకొని పడుకున్నాడు. రాత్రి ఒంటి గంటకు లేచాడు. మెల్లగా చప్పుడు కాకుండా వెళ్లి భార్య మెడలో తాళంచెయ్యి కట్టి ఉన్న గొలుసు తీసుకున్నాడు. మెల్లగా తాళం చేతితో పెట్టె తెరచినాడు. దాంట్లో రెండువందల యాభైరూపాయలు ఎప్పటిమాదిరే వుంచి మళ్లీ తలుపువేశాడు. మళ్లీ పిల్లి అడుగులు వేసుకుంటూ ఆ గొలుసును భార్య మెడలో వేశాడు. తరువాత ఒళ్లు విరుచుకొని రెండుమూడు సార్లు ఆవలించి వచ్చి పడుకున్నాడు.

తెల్లవారి ఎనిమిది అయిందాకా అట్లాగే పడుకొన్నాడు.



తెలుగు టీచరు: ఒరే సోమూ! "చిన్నారి పొన్నారి చిఱుత కూకటి నాడు" శ్రీనాథుడు వ్రాసిందేమిటిరా?

సోము: ఓనమాలండీ

* * *

తండ్రి: ఒరే చంద్రం! నీ అంత వయస్సులో నేను అబద్ధాలు ఆడేవాణ్ణే కాదు.

కొడుకు: అయితే ఎప్పటి నుండి ప్రారంభించేవు నాన్నా.

* * *

డాక్టరు: (చనిపోయిన రోగి బంధువుతో) అరెరె ఇంత క్రితమే కదూ బిల్లుఇచ్చి పోయేను, అప్పుడే ఏలా చచ్చిపోయేడు?

బంధువు: ఆబిల్లు చూచే కదండీ ఆయన చచ్చిపోతా.

శ్రీ కన్నికంటి కోకిల కుమార్.



ప్రసాద్ గారి "పెంపుడు కొడుకు" లో ప్రసాద్.



## సొసైటీ పిక్చర్స్

మిమ్మల్ని వినూతన చలనచిత్రానుభవానికి ఆహ్వానిస్తున్నది

# "ప్రపంచం"

అది అద్భుతమైనది! అది మానవత్వాన్ని బోధిస్తుంది! అదొక మానవజీవితానుభవం!

అదొక ప్రత్యేకతగలది! అదొక

**25** లక్షల రూపాయలకు పైబడి ఖర్చుపెట్టబడ్డది!.... తయారుచేయుటకు **3** ఏళ్లకుపైగా పట్టింది!....

**250,000** అడుగుల కెక్కువ ఫిలిం తీయబడ్డది!.. **50**కి అధికమైన ప్రత్యేక సెట్టింగులు ఉన్నవి!..

**140**కి ఎక్కువ అద్భుత రంగాలు!..., **10,000**కి పైని ఎక్స్ట్రాలు...

**160**కి ఎక్కువ సంభాషణలు గల భాగాలు!....

మరిన్ని సంగీతం-నాట్యం రోమాంచన ఘట్టాలు-అద్భుతరంగాలు

అంతా ఒక్కట్లోనే

మహత్తర చలన చిత్రం



సొసైటీ పిక్చర్సువారి ఒక అద్భుత బహుమానం

SPZ-16 T6

# "ప్రపంచం" ఒక అద్భుతం



ఫిలిములలో
అనుపమోత్తమమైనది.
సాటిలేని మేటి చిత్రం.

**1953 జూలై 10** శుక్రవారంనాడు
దక్షిణఇండియా అంతటా ఒకేమారు
విడుదల అగుచున్నది.



"ప్రపంచం"లో జి. వరలక్ష్మి



"ప్రపంచం"లో రామశర్మ.

మూడు సంవత్సరములపైబడి సర్వశక్తుల కృషిచేసి "ప్రపంచం"ను పూర్తి చేసితిమని ప్రకటింప సంతసిస్తున్నాము. ఇది నిశ్చయంగామీకండ్లకు, వీనులకు, మనస్సుకు కూడా విందుచేస్తుంది. కళా విశిష్టంగా సృష్టించబడిన బ్రహ్మాండమైన దృశ్యాలు మొత్తం 140 పైబడిఉన్నవి. చలనచిత్ర నిర్మాణంలో ఇవి కని విని ఎరుగనట్టివి. మాట్లాడే పాత్రలను మేము 160 ని ప్రవేశపెట్టాము. ఇంకా వేలకొలది పురుషులు, స్త్రీలు మీకగుపించగలరు. మిమ్ము ఆనంద పరచగలరు.

ఇందు అపారమైన ఖర్చుతో నిర్మింపబడ్డ వివిధ రకముల 50 సెట్లు, 1,500 లకంటె ఎక్కువ 'షాట్లు' ఉన్నవి. బహు చాకచక్యంగా అల్లుకు వచ్చిన ఈకథ ఆసాంతం ఒక్క నైరుస్యం గాని తడబాటుగాని లేక సూటిగా, సులభంగా నడుస్తుంది. రసవత్తరమైన వివిధ ఘట్టాలతో నిండియున్నది.

## వాస్తవిక మైనది

ఈచిత్రంలో ఎక్కడా ప్రేక్షకులకు విసుగు పుట్టదు. దృశ్యాలలోగాని, సన్నివేశాలలోగాని, భావాలలోగాని పునరుక్తిదోషం ఎక్కడా లేకపోవటం ఈ కథ విశిష్టత. ఈ కథలో 'సస్పెన్సు' ఒక్క అసంగతంకూడా లేకుండాఉంది.

ఫిలిం అభిమానుల తీర్పు నిర్మాతల నసేకులను తరుచు నిర్వేర పెట్టింది. కాని ప్రేక్షకుల తీర్పు ఎల్లప్పుడూ సరైనదని పూర్తిగా గ్రహించిన ఈ కథా రచయిత్రి మానవ చిత్తప్రవృత్తిని పూర్తిగా అవగాహనచేసుకు నేందుకు సర్వశక్తుల కృషి చేసింది. ఏమంటే మానవజాతి ఏయే విభిన్న జీవిత మార్గాల ననుసరస్తున్నా, మానవుని ప్రతిభ, పురోగమ వాంఛ అప్రతిహతమైనవి.

## భగీరథ కృషి

ఒక బాలుడు క్రమశః పెద్దవాడైనట్లే జయప్రదమైన చిత్రం 'క్లైమాక్సు'లలో వృద్ధిపొందాలి. మనోవిషంగా జరిగితే, ప్రేక్షకుల మనసును ఒకుదుడుకు చేస్తుంది. చిత్రం లోతుకు సాగినకొద్దీ వారికి విసుగు కలుగుతుంది.

మనసుకు ఉల్లాసం కలుగచెయ్యటమే చలనచిత్రం చూడటంలో ఉద్దేశం. మరి బాధ కొని తెచ్చుకోనేందు కెవ్వరూ డబ్బు చెల్లించరు. కాబట్టి అతి ముఖ్యమైనది వినోదం. అయితే వినోదం మాత్రమే ఉండి, పటువైనకథ లేకపోతే, అది వాచాలత అవుతుంది. హృదయాన్ని పిండిపెట్టే కరుణ రసంతో నింపబడ్డ కథ ప్రేక్షకులను మళ్ళీ మళ్ళీ చూడనివ్వదు. ఇక కేవలం ప్రణయ జీవిత కథైనా మామూలు పన్నాగాలు, జీవితంలో నిత్యాటక సంఘటనలు లేనిదే అట్టి కథ, ప్రత్యేకించి తెరమీద, పట్టుగలిగి ఉండలేదు. కనుక, చలనచిత్రానికి కథ వ్రాయటం భగీరథ కృషియని మీరు మాతో ఏకీభవించగలరు.

## సాటి లేనిది

ఇది బహు నవ్యమైన రచనా విధానం. విషయంపైన విషయం, సంఘటనపై సంఘటన ఒత్తుగా అల్లుకురాబడినది. ఇంతవరకు వచ్చినవాటిలో సాటిలేని మేటి - మీరు కోరినన్ని పూర్తు మాచి నిశ్చయంగా ఆనందించగల చిత్రం "ప్రపంచం".

దీనికి అనేక లక్షలు ఖర్చయింది. 250,000 అడుగుల పిక్చరు నెగటివ్ ఎత్తబడింది. 100,000 అడుగుల ఎడిట్ చేయబడిన ఫిలిము మూడుగంటల ప్రదర్శనానికి సరిపడే మామూలు పొడుగుకు తగ్గించబడినది.

దీనికి 304 ఫ్లోర్ దినాల షూటింగు జరిగింది. 275 మంది కన్న ఎక్కువ సిబ్బంది నిరంతరంగా మొత్తం 1,194 రోజులు కష్టించి పనిచేశారు.

కార్నివాల్‌కి, డాన్సులకి మాత్రమే అయిదులక్షల రూపాయిల పైబడి ఖర్చయింది. పాటలకు మూడున్నర లక్షలకు కొంచం పైబడి ఖర్చయింది. సెట్లకు, కాస్ట్యూములకు, డ్రస్సులకు లక్షలయింది ఇక తారల కెంతయిందో అది చెప్పటం భావ్యంకాదు [illegible] చెప్ప దలచుకోలేదు అయినా వెండి తెరమీద ఎవరికీగాని తీసిపోని ఈ సుప్రసిద్ధతారలను సమకూర్చటానికి ఎంతభారీ మొత్తమయి ఉంటుందో మీరు ఊహించగలరు.

[ఉదయాన్ని ప్రక్క పేజీలో

## తెరమీద

| | |
|---|---|
| జి. వరలక్ష్మి | వి. నాగయ్య |
| ఎస్. జానకి | పి. రామశర్మ |
| లక్ష్మీకాంత | కె. రఘురామయ్య |
| ఎక్స్. వి. కాంచన | నల్ల రామమూర్తి |
| ఛాయాదేవి | పి. వి. సుబ్బారావు. |
| టి. కనకం | వల్లం నరసింహారావు |

—— ఇంకా అనేకులు. ——

నృత్యాలు : జానపదనృత్యాలు : కుమారి కమల.
భరత నాట్యాలు : లలిత, పద్మిని.
మల్లయుద్ధము : దారాసింగు, అలీ రజా కే.
మస్వశక్తి : వాంగ్ బక్ లీ.


సుబ్బారావు - ఛాయాదేవి


జానకి (ప్రేమ), వెంకయ్య (ప్రేమ తండ్రి)


రామశర్మ, ఛాయాదేవి, యస్. ఎ. కాంచన్, సుబ్బారావులు.


రామశర్మ - జి. వరలక్ష్మి


లక్ష్మీకాంత జి. వరలక్ష్మి


లలితగా లక్ష్మీకాంత





నరసింహారావు - ఎస్. జానకి


లీల (జి. వరలక్ష్మి) మనసు కరుగుతుంది


వల్లం రామ్మూర్తి, కనకం


కామోద్రేకంలో మైమరచిన ఇన్‌స్పెక్టరు.


రఘురామయ్య కాంచన్


జి. వరలక్ష్మి రామశర్మ

## సమీక్ష:

# నన్హే మున్నే



నిర్మాతలు: ఆహ్లాద చిత్ర.

డైరక్టర్: దత్తా ధర్మాధికారి

నటీనటులు: బేబీ శకుంతల, సులోచన, రాజా నేనే మొదలైన వార్లు.

వాస్తవ జీవితంలోని ఒక యధార్థ గాధ ఆధారంగా నిర్మించినట్లు డైరక్టర్ దత్తా ధర్మాధికారి చెప్పిన మాటను 'నన్హే మున్నే' (హిందీ) చిత్రం అక్షరాలా నిరూపించింది. నిజానికి హిందీ చలనచిత్రరంగంలో ఇది ఆశారేఖ యధార్థానికి మెరుగుపెట్టనిదే సినిమాలో రాణింపదని భావించే వారి భ్రమల నీ చిత్రం



సొసైటీవారి ప్రపంచంలో జి. వరలక్ష్మి, రామశర్మ



జూలై 10 వ తేదీన దక్షిణ భారతదేశమంతటా విడుదల చెయ్యబడుతున్న సొసైటీ పిక్చర్స వారి ప్రపంచంలో ముఖ్య పాత్రధారిణి జి. వరలక్ష్మి



నేషనల్ ఆర్టుస వారి 'పిచ్చి పుల్లయ్య'లో ఇంగ్లీషు మాట్లాడుతున్న యన్. టి. రామారావు, తెల్లబోయి చూస్తున్న రమణారెడ్డి, మహంకాళి వెంకయ్యా వగైరా



# నన్నే మున్నె

వదలగొట్టింది. (ఏడాదికిపైగా బొంబాయి నగరవాసుల ఆదరణ పొందిన ఈ చిత్రాన్ని మద్రాసులో తెలుగు తమిళ్ భాషల్లో తియ్యడానికి యత్నాలు జరుగుతున్నా యని కూడా వినికిడి.) కనకాభిషేకం చేయిందగలరని పేరుపొందిన పెద్ద పెద్ద తారలు లేకపోవడం ఈ చిత్రానికి రక్ష అయింది యధార్థ జీవితం హద్దులు దాటని ఈ చిత్రం ప్రేక్షకుల హృదయా... క...

← యునైటెడ్ టెక్నీషియన్స శ్యామలా వారి "పల్లెపడుచు" లో కుటుంబరావు, సీతారామయ్య.

లించివెయ్యగల దవడంలో సందేహంలేదు. ఇది స్టార్ టాకీస్‌లో జూలై 10 మొదలు ప్రదర్శించబడుతుంది.

బొంబాయిలో ఒక టాక్సీ డ్రైవర్ సంసారం ఛిద్రమైపోయిన చరిత్ర దీనికి కథావస్తువు. టాక్సీ డ్రైవర్ గోవింద్ (రా[illegible]నే) దారిద్ర్య బాధను సహించలేని అస్థిరచిత్తుడు. ఉత్తమ యిల్లాలు శారద (సులోచన) వల్ల సంసారంలో ఉన్న కొస్తయినా సుఖం మిగిలింది. పెద్దకూతురు ప్రభ (బేబీ శకుంతల) సహాయంతో కొడుకులు ముగ్గుర్నీ సాకుతుంది. ఒకనాడు టాక్సీ ఎక్కిన ఒక ధనవంతుని ధూర్తదూషణను సహించలేక ఆవేశంలో టాక్సీ డ్రైవర్ గోవింద్ హాండిల్‌తో కొట్టగా ధనవంతుడు చచ్చిపోతాడు. గోవింద్ పారిపోయి ఒకచోట కూలిగా చేరి భార్యకు డబ్బు పంపుతాడు. శారద మనోవ్యధతో రోగగ్రస్తురాలై మరణిస్తుంది. ఆమె దహన క్రియల సమయానికి శ్మశానం చేరిన గోవింద్‌ని పొరుగింటి పెద్ద మనిషి పోలీసులకు పట్టిస్తాడు. తమ్ముళ్లిద్దరూ పేపర్లమ్మి సహాయపడగా ప్రభ బీడీల ఫాక్టరీలో చేరి జీవనోపాధి ఆర్జించుకోడానికి యత్నిస్తుంది. ఇంటి అద్దె బాకీ పడగా చూసి పొరుగునున్న మరొక భాగ్యవంతురాలు బాకీ అద్దె యజమానికి కట్టి వీరి నివాసాన్ని స్వాధీనపరుచుకుంటుంది. అన్నెమూ పున్నెమూ ఎరుగని పసిబిడ్డల్ని (నస్లై ముస్నే) వెంట పెట్టుకుని ప్రభ అనాథాశ్రమం చేరుతుంది.

ఈ కథను హృదయంగమంగా చిత్రించడానికి రచయిత అపూర్వమైన అవకాశాల నిచ్చాడు. డైరెక్టర్ ఈ అవకాశాలను పూర్తిగా వినియోగించుకోలేకపోయినప్పటికీ, వాస్తవికత కోసం చూపిన శ్రద్ధ ఫలించింది. కథలోని వివిధ ఘట్టాలు ప్రేక్షకుల హృదయాలలో హత్తుకొనిపోతాయి. మొట్టమొదటిసారిగా చీర కట్టి నిలబడిన అక్కను చూసి పసిబిడ్డలు పోయిన తల్లిని చూసినట్లు భ్రమించి, ఆమె కాళ్ళను పెనవేసుకొన్న ఘట్టం మరువరానిది. చిరునవ్వుతో కష్టాలను భరించి సంసారాన్ని నెట్టుకొచ్చిన తల్లిగా సులోచన, తల్లిదండ్రులు లేని పసిబిడ్డలను సాకిన సోదరిగా బేబీ శకుంతల, వీరిద్దరి పాత్ర చిత్రణా ఉత్తమోత్తమంగా ఉంది. బాక్సాఫీస్ కోసం ఎంత ఖర్చుకైనా వెనుదియ్యని చిత్ర నిర్మాతలందరితో పోటీగా నిలబడి ఇటువంటి చిత్రాన్ని నిర్మించడానికి సాహసించిన డైరెక్టర్ దత్తా ధర్మాధికారి కృషి ప్రశంసనీయం. ★



జూన్ ఆఖరువారంలో విడుదలైన వినోదావారి దేవదాసులో నాగేశ్వరరావు, పేకేటి శివరాం.

# ప్రశ్నలు - సమాధానాలు ★

శ్రీ మున్నట రామారావు—విజయవాడ.

24-6-58 తేదీ కాలక్షేపంలో సత్తు తప్పెల "కిలుము" పట్టదు అన్నారు. మనలో కొందరు దానిని "చిలుము" అంటారు. ఏది రైటు?

—రాగి మొదలైన లోహ పాత్రలకు పట్టునటువంటి మురికి పదార్థమునకు "చిలుము" అని పేరు. ఇది రైటు. కాని వాడుక భాషలో దానినే "కిలుము" అని అనుట కలదు. నిఘంటు ప్రమాణమునుబట్టి "చిలుము" అనే మాట రైటు. లోకవాడుక ప్రమాణమునుబట్టి "కిలుము" కూడా రైటే.

*　　*　　*

శ్రీ ఏలూరి వీరరాఘవరావు-నిడదవోలు.

17-6-53 కాలక్షేపంలో దాసువామనరావుగారు "రాతిలోని కప్ప రక్షించు నెవ్వాడు?" అన్నారు. అంటే అర్థం ఏమిటి?

—కొండరాయిని పగులకొట్టితే దానిలోపల ఒక కప్ప సజీవమైయుండుట కొన్ని సందర్భములలో కన్పించుట కలదు. ఆ రాతిలో ఉన్న కప్ప సజీవంగా ఉండుటకుగాను, ఆ కప్పను రక్షించువాడెవడు? వాడే లోకాన్ని రక్షిస్తున్నాడు. సమస్త జీవరాసులను రక్షిస్తున్నాడు.

*　　*　　*

శ్రీ కోనేటి లక్ష్మీ నరసింహమూర్తి—తాడేపల్లిగూడెం.

రామాయణంలో పిడకలవేట అంటే ఏమిటి?

—రామాయణం సుందరకాండ పారాయణం చేస్తున్న సమయంలో ఇంటిలోని ఎత్తయిన పిడకల దొంతర ఒకటి దొర్లికిందపడింది. రామాయణం పారాయణం చేయడం నిలిపివేసి ఆ పిడకల దొంతర విషయమై చూచుటకు లేచి వెళ్ళవలసివచ్చింది. ఏకాగ్రచిత్తంతో చేయవలసినపని చేయకుండా మధ్యలో ఆపివేయడం ఆవిధంగా ఉంటుంది.

తణుకోయి మాచవరం అంటే ఏమిటి?

—మాచవరం అనే గ్రామానికి పోవుటకు దగ్గరత్రోవ ఒకటిఉంటే, ఆత్రోవను పోకుండా, చుట్టు తిరుగు దూరప్రయాణంతో కూడిన మరొకమార్గం అనుసరించి తణుకుపోయి అక్కడినుంచి మాచవరం చేరడం ఒకప్పుడు జరిగింది. చుట్టుతిరుగుడు వ్యవహారాలన్నీ యిటువంటివే.

తుని తగవు అంటే ఏమిటి?

—తూర్పుగోదావరి జిల్లాకున్ను విశాఖపట్నం జిల్లాకున్నూ మధ్యస్థంగా తుని ఉంది. దానిని గోదావరి జిల్లాలో చేర్చడమా? విశాఖపట్నం జిల్లాలో చేర్చడమా అనే తగవు ఒకటి సంభవించింది. చాలా క్లిష్టమైన సమస్య అయింది. అటువంటి విధ జనకు కష్టసాధ్యమైన క్లిష్టసమస్యలకు తునితగవు సామ్యం.

*　　*　　*

శ్రీ దొప్పలపూడి సాంబశివరావు—తెనాలి.

మన ప్రభుత్వమువారు రేడియోలో విద్యార్థుల ఉపయోగార్థమై మాధ్యమిక, ప్రాథమిక, ఉన్నత పాఠశాలల విద్యార్థుల కార్యక్రమములను ప్రసారము చేయుచున్నారు. వారు ఆ కార్యక్రమమును ప్రసారము చేయునపుడు, పాఠశాలలో పాఠములు జరుగుచుండును. అట్టి సమయంలో విద్యార్థులు యీ కార్యక్రమములను వినుటకు వీలు లేదుకదా?

—పాఠములు జరుగుచున్న సమయములో రేడియో ప్రసంగములను వినుటకు వీలులేదు. కాని, స్కూలులో రేడియో అనేది కూడా చాలా స్కూళ్ళలో లేదు. ఏ స్కూలులోనైనా, ఒక రేడియో యంత్రం ఉంటే ఉండవచ్చు. కాని, ఎన్ని క్లాసులు ఉన్నాయో అన్ని రేడియో యంత్రాలు లేవు. ఒకే రేడియో యంత్రం ఉంచి దానికి లవుడ్‌స్పీకర్లు తగిలించడం వల్ల స్కూలులో రణగొణ ధ్వనిగా ఉంటుంది. కనుక రేడియో ఉన్నటువంటి స్కూలులో అప్పుడప్పుడు ఆయా క్లాసు పిల్లలకు అక్కరకు వచ్చే ప్రోగ్రామును ఆయా క్లాసు పిల్లలకు విన్పించడం మంచిది. ఆవిధంగా క్లాసుపాఠాల కార్యక్రమం నిర్ణయించవచ్చు.

*　　*　　*

శ్రీ మేలిసీమ రామన్న—లత్తవరము (అనంతపురం జిల్లా)

కొందరు 'ఆలస్యం అమృతం విషం' అంటారు. మరికొందరు "నిదానమే ప్రధానము" అని చెప్తారు. ఇందులో ఏది ఎంతవరకు మంచిది?

—ఇవి సమయోచిత నీతివాక్యములు. ఏ సందర్భంలో ఏది దేహారోగ్యానికి పథ్యమో గ్రహించి దానినే భుజించాలి. అదేప్రకారంగా ఏ సందర్భములో ఏ నీతిసూత్రము అక్కరకు వస్తే దానినే స్వీకరించి అనుసరించాలి.

*　　*　　*

శ్రీ జె, యమ్ రామశర్మ, హనుమకొండ.

మధ్య తరగతిలో జీవించు మనుష్యునకు ఏవయస్సులో మనస్సునకు శాంతి లభించును?

—మధ్య తరగతి సంసారులు యిటు భూమిమీద బ్రతుకలేక, అటు స్వర్గసౌఖ్యమూ పొందలేక మధ్యస్థంగా ఆకాశంలో ఉట్టి కట్టుకొని వ్రేలాడుచున్నట్లుగా జీవిస్తున్నారు. నేలవిడిచి సాముచేసినట్లుగా మంచి భూస్వాములుకూడా కాకుండా జీవిస్తున్నారు. వారికి యిహంలేదు పరం లేదు అన్నట్లుగా ఉంది. వారికి ఉద్యోగాలు కరవైనాయి. వారు భూమికి బరువైనారు. మధ్య తరగతివారి స్థితిని బాగు చెయ్యాలనే శ్రద్ధ పట్టుదల ప్రభుత్వానికి లేదు. ఈ పాపం శాంతిస్తేనే గాని మధ్యతరగతిలోని వాని జీవితానికి శాంతి లేదు.

కోరికలు ఉండరాదు అని భగవద్గీతలో చెప్పినారు గదా. అవి లేనిదే మానవుడు ఏవిధముగా జీవించగలడు?

—"కోరిక" అనగా ఒక పని చేయవలెననే సంకల్పము. ఆ విధంగా ఆ మాటకు అర్థం చెప్పినయెడల, "కోరికలు" అనగా "సంకల్పములు" ఉండవలసినవే. "కోరిక" అనగా ఒక కార్యమువల్ల కలిగే "ఫలితము" అనిఅర్థం చెప్పినట్లయితే,అటువంటి కోరికలు వుండకూడదు. వ్యవసాయం (కృషి) చేయవలెననే సంకల్పం,కోరిక ఉండవచ్చు.మన పంటపండి తీరుననే ఆశ ఉండకూడదు. ఫలితం అనే దానికి మనకృషి ఒక్కటే కారణభూతం కాదు వర్షంవగైరాయింకా అనేక దైవిక కారణాలు ఉంటాయి. కనుక మనకృషివల్లనే ఫలం లభించి తీరునను ఆశ (కోరిక) పెట్టుకొని పనిచేయడం అవ్యక్తం - అజ్ఞానం అయుక్తం.

★

# ★ గుంటూరు ★

(11-పేజీ తరువాయి)

ఓరోజున మాత్రం ఆమెని పుట్టింటికి తీసుకు వెళ్ళేడు. తను ఒంటరిగా తిరిగి వచ్చేడు. ఆమెని తిరిగి తీసుకురాలేదు.

"అది గుంటూర్లో పుట్టిందన్న సంగతి ముందుగానే నాతో ఎందుకు చెప్పకపోవాలి? అంత రహస్యంగా ఎందుకు దాచాలి?" అని కోపంగా ప్రశ్నిస్తాంటాడు.

"మా అమ్మాయి ఫలానా ఊళ్ళో పుట్టింది. అభ్యంతరం లేకపోతే మీకు ఇష్టం ఉంటే మా అమ్మాయిని చేసుకోవచ్చు. అభ్యంతరం లేకపోతే మీకు అభ్యంతరం ఏమైనా ఉందా?" అని ఎవరైనా ఎక్కడైనా అడుగుతారా? ఫలానా వూళ్ళో పుట్టడం గొప్ప నేరం అని ఎక్కడైనా రాసి ఉందా? ఎక్కడున్న వాళ్ళు అక్కడ పుట్టక ఏం చేస్తారు? అదీగాక, నీకిటువంటి వెర్రి ఉందని వాళ్ళకేం తెలుస్తుంది? "నాకు ఈవిధంగా ఒకరోగం ఉందండి. అటుపైన మీ ఇష్టం. పిల్లని ఇస్తే ఇవ్వండి. లేకపోతే మానండి" అని నువ్వెందుకు వాళ్ళతో చెప్పలేదు?" అని ఎంత చెప్పినా లాభం లేదు. మారుమాట్లాడక లేచి వెళిపోతాడు నా దగ్గర్నుంచి.

అంతేగాని, పిల్లని తీసుకురాడు.

నరసన్న ప్రవర్తన గురించి నేను సిగ్గుపడాల్సిన పరిస్థితి ఏర్పడింది. బరంపురం వెళ్ళినప్పుడల్లా అతని త్తవారింటికి వెళ్ళేవాణ్ణి. వెళ్ళడం ఇప్పుడు మానుకోవలసి వచ్చింది.

కాని ఒకసారి వెళ్ళక తప్పిందికాదు. నరసన్న మావఁగారు ఆ వూళ్ళో దార్లో కనిపించి వాళ్ళ ఇంటికి లాక్కుపోయారు నన్ను.

నేను వెళ్ళేసరికి నరసన్న భార్య లోపల వరండాలో స్తంభాన్ని అనుకొని కూర్చుంది. ఆమె చేతిలో ఓ ఉత్తరం ఉంది. నేను వెళ్ళేసరికి కూడా ఫుడిగా లేచింది. ఆమె ఏడుస్తోంది.

"ఎక్కణ్ణించే ఉత్తరం?" అని అడిగేడు ఆమె తండ్రి.

ఆమె జవాబు చెప్పకపోవడం చూసి భర్త రాసిన జాబనే అనుకున్నాం, ఆమె తండ్రీ నేనూ కూడా.

"ఏమంటాడే? ఏమంటాడు?" అని అడిగేడు ఆమె తండ్రి.

"అంతే అంతే" అని ఏడుస్తూ మళ్ళీ కూలబడింది ఆమె. ఏడుస్తూ ఏడుస్తూ కూర్చొంది అలానే.

నాకు అప్పుడు చాలా బాధ కలిగింది. ఏం చెయ్యాలో తోచింది కాదు.

నా చిన్నతనంలో మా ఇంటి పక్క ఓ బట్టతలాయన ఉండేవాడు. ఎండలో, దీపాల వెలుగులో అతని తల నిగనిగలాడేది. మా ఎదటింట్లో బట్టతలవాడు కాని మనిషి ఒకాయన ఉండేవాడు. అతను వయసుకి పెద్ద. పెంకితనానికి చిన్న. బట్టతలాయన పగలు వీధిలోకి వచ్చినప్పుడల్లా "అయ్యో! ఇంత ఎండగా ఉంది కదా! మీ బట్టతలకి ఓ తలబట్ట ఉపయోగించరాదా?" అని అడిగి నవ్వేవాడు ఎదటింటి మనిషి.

అంతటితో ఆగక మా చిన్నపిల్లల్లో కొంతమందికి కాణీ కాణీ చొప్పున ఇచ్చి మా పక్కింటి బట్టతలాయన్ని "జపాన్ గుండూ, జపాన్ గుండూ" అని ఎదటింటాయన పిలిపించేవాడు కూడాను.

నాకు చిన్నతనం కొబట్టి అంతగా తెలీలేదు, కాని, బట్టతలాయనకి ఎదటింటి ఆసామీయెడల విపరీతమైన కోపం కలిగే ఉంటుంది.

ఒకరోజున నేనూ, ఎదటింటి ఆసామీ యొక్క ఆరేళ్ళ కొడుకూ మా పక్కింటి బట్టతలాయన ఇంటికి ఆయన పిల్లల్తో ఆడుకోండికి వెళ్ళేం. ఆడుకొంటూ ఉంటే అకస్మాత్తుగా బట్టతలాయన వచ్చి ఆరేళ్ళ పిల్లడి రెక్క పట్టుకొని వీపుమీద ఛళ్ళు ఛళ్ళు మని కొట్టి, "ఎవడ్రా నిన్నిక్కడకి రమ్మన్నది? ఫో, మీ ఇంటికి ఫో" అని కేకలు వేసి కసిరేడు.

ఆరేళ్ళ కుఱ్ఱవాడు మొట్టమొదట బిక్కచచ్చిపోయేడు. తరువాత బిగ్గరగా ఏడ్చేడు. ఏడుస్తూ వెళిపోయేడు.

మా అందరికీ బట్టతలాయన ప్రవర్తన చూసి భయమేసింది. కోపం కలిగింది.

ఆరేళ్ళ పిల్లడు ఆనాడు ఏడ్చినట్టే నరసన్న భార్య స్తంభానికి చేర్లబడి కూర్చొని ఏడ్చింది.

ఏం మాట్లాడానికీ తోచక నేను ఊరుకొన్నాను.

నేను మాటాడక బైటికి వచ్చేశాను.

తరువాత స్నేహితుణ్ణి కలుసుకొండికి వెళ్ళేను. అతను ఉండే ఇంట్లో భాగంలో ఎవరో ఒరియా వాళ్ళున్నారు. నేను వెళ్ళేసరికి ఆ భాగంలోంచి కటకంలో ఉన్నటువంటి కర్తీ లేని ఒరియా కల్పరు బరంపురంలో లేదని ఒకడు గట్టిగా కేకలు వేస్తున్నాడు.

నేను అక్కణ్ణించి కూడా బైటకి వచ్చేశాను.

[ఈ కథలో "నేను," "అప్పల నరసింహం" అనే పాత్రలు నిజం కావు. ఇదంతా ఒక కథ. ఇది నిజంకాదు; కానే కాదు.] ★

# ★ ప్రేమదేవత నవ్వింది ★

(8-వ పేజీ తరువాయి)

రుద్దుతూవుంటే అటు రసం పోస్తే ఎల్లాగ? అంటూ. తమ్ముడి కళ్ళల్లో కుంకుడుకాయ పోసినందుకు చివాట్లు కూడా తినవలసి వచ్చింది. ఆ అమ్మాయి ఏం చేస్తుంది పాపం! మనస్సంతా వీధి వాకిలివేపే వుంది. సరోజిని కడి పెట్టని ఖయిదయింది. ఎప్పుడీ చెర తప్పించుకుని బయట పడదామా అని తహతహలాడిపోతూవుంది. తను యిక్కడ వున్నా చూపంతా వీధివేపే వున్నది.

ఆవేళ అతనే, నిజానికి అతనే, అతను రానే వచ్చాడు. గుమ్మంలో నిలబడ్డాడు. లోపల సరోజిని కలవరం ఎక్కువైంది. అతను వొక్కొక్క మెట్టూ ఎక్కుతూవుంటే సరోజినికి గుబులెక్కువవుతూవుంది. అతను చావిట్లోకి వచ్చాడు. సరోజిని గట్టునపడ్డ చేపపిల్లలా గిలగిలలాడిపోయింది. అతను "సరోజినీ......" అంటూ తన పేరు పెట్టి పిలుస్తున్నాడు. అతని పిలుపన్నా పూర్తికాకుండా వొక్క పరుగున వెళ్ళాలనుకుంది. కాళ్ళకు సంకెళ్ళుపడ్డట్టయి అడుగు ముందుకు పడలేదు. అమ్మ తనవంకే చూస్తూవుంది. తన కెక్కడ్నుంచి వచ్చిందో తగని సిగ్గు ముంచుకొచ్చింది. మళ్ళీ అతను పిలుస్తున్నాడు. 'ఎవరేమనుకున్నా సరే' అని ఎక్కడలేని తెగింపువచ్చింది. ఇన్నాళ్ళూ యీ క్షణం కోసం యీ తియ్యని క్షణం కోసం ఎదురెదురు చూస్తూ చివరికి అతను వాకిట్లోకి వచ్చి పిలుస్తూవుంటే బిడియం పడ్డమా? సరోజిని సిగ్గుతెరను ఛేదించి లేడిపిల్లలా ఛంగున వొక్కంగలో చావిట్లోకి దూకింది.

'ఇదుగోనమ్మా వుత్తరం' అంటూ అతను—అతనంటే పోస్టుబంట్రోతు సరోజినికి ఒక కవరుయిచ్చి వెళ్ళిపోయాడు.

గులాబీరంగు కవరూ ముత్యాలు ముగ్గు పెట్టినట్టున్న దానిమీది అక్షరాలూ సరోజినిని పలుకరిస్తున్నాయి. ఒక్కసారి ఆ లేతగుండెలో వుడుకులాంటి చల్లదనం—స్వస్తిక్ హెయిరాయిల్ సువాసనా—కస్ కస్ సెంటు పరిమళాలూ, అన్నీ గుప్పున గుబాళించాయి. ఇన్నాళ్ళూ తను దీనికోసం; యీ కవరుకోసం; యీవారు 'వ్రాస్తా' నన్న మొదటి వుత్తరంకోసం పడిన తపన అంతా తొలకరివానకు వేగిన భూమిలాగా చల్లబడిపోయింది. తన తపస్సు ఫలించింది. ప్రేమదేవత ఫక్కున నవ్వింది! ★

# ★ "వేషంవల్ల వచ్చిన దోషం" ★

(19 వ పేజీ తరువాయి)

"ఏమిటిరా మీ నాన్న అంత కంగారుగా వున్నారు- ఏమిటి విశేషం?" అంది.

"ఏమీలేదమ్మా, పై క్లెరికల్ వేటుకం పెనీవాళ్ళకి కొందరు కావాలిట. దానికి నాన్నగారు అప్లికేషన్ పెట్టించారు" అన్నా.

"హు..." అని నిట్టూర్పు విడచి" ఈ మనిషితో ఎప్పుడూ యింతే, ఆయనకి పూర్తిగా నిన్ను చదివించాలని లేదురా ఇదంతా నాకోసం అనుకుంటున్నారేమో!" అంటూ అమ్మ అక్కడనుంచి నిష్క్రమించింది. ఈలాగ యింట్లో విభిన్న దృక్పథాలతో సంఘర్షణలు పెచ్చు పెరుగుతున్నాయి. అమ్మమాట వినకపోతే అమ్మ కోపం - నాన్నగారి మాట వినకపోతే నాన్నగారికోపం - వీరిద్దరి మధ్య నేను నలిగిపోతున్నా - మానాన్నగారు రోజూ పోస్టాఫీసు చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నారు. మా అమ్మ తెలిసివున్న కాలేజీ కుఱ్ఱాళ్ళందర్నీ స్కాలరుషిప్పు కోసం ఎన్‌క్వైర్ చేస్తోంది. నేను తటస్థ విధానం అవలంబించి ఏది వస్తే దానికి వెడదామని వూరుకొన్నా.

నాన్నగారు ఒకరోజున కంగారుగా నాదగ్గరకొచ్చారు. ఆయనను చూసేసరికి నాకు కంగారు పుట్టింది.

"ఒరేయ్! నువ్వు విజయవాడ వెళ్ళాలిరా" అన్నారు.

"ఎందుకు" అన్నా.

"మొన్న పెట్టిన అప్లికేషనుకి ఇంటర్వ్యూ వచ్చిందిరా."

"అయితే ఏ రోజు వెళ్ళటం."

"ఈవాళే ఈ బండికి వెళ్ళిపో" అన్నారు. నేను అమ్మ దగ్గరకు వెళ్ళి సంగతంతా చెప్పాను. అమ్మ ఈ మాటకు మూతి విరిచింది. నాన్నగారి పట్టుదలమీద ప్రయాణం కాక తప్పలేదు. అమ్మ కుట్టించిన కొత్త బట్టలువేసుకొని నాన్నగారిదగ్గరకొచ్చాను. నన్ను తేరిపారచూసి "ఏపని చేసినా, మన తాహతుకు, మన హోదాకు సరిపోవాలిరా, కాని వేషభాషలతో ఆడంబరంగా వుంటే, ఆదరించేవారుండరు..." అనివుపన్యాసధోరణిలో మాట్లాడుతున్నారు నాన్న. నాన్నగారి వాక్యాలలోని అంతరార్థమేమిటో నాకు అవగాహన గాలేదు. ఆయనవంక వెఱ్ఱిగా అలాగే చూస్తూ వుండిపోయాను. మళ్ళీ మా నాన్న అన్నారు.

"మన ప్రవర్తనలో, మన వేషంలో, మనం మాట్లాడే మాటల్లో ఎదటివారికి కరుణ, దయ కలిగేటట్లు చెయ్యాలి. అలా వున్న రోజున మనకి ప్రపంచంలో ఒక స్థానం వుంటుంది."

"అంటే?"

"అంటే నీ వేషభాషలలో నువ్వొక ధనవంతుని బిడ్డవని, నిన్ను చూసిన ప్రతీ వాడు అనుకొంటాడు. నిజంగా నువ్వొక ధనవంతుని కొడుకువేనా? పొట్టకోసం ఒళ్ళు అమ్ముకొని పనిచేసే ఒక కష్టజీవివి. అటువంటి నీకు ఈ ఆడంబరమైన దుస్తులు ఎందుకు చెప్పు" అన్నారు. అంటే తొడుక్కొన్న సిల్కు బట్టలు మార్చెయ్యమని.

"అమ్మ చాకలిదానికి అన్ని బట్టలూ వేసేసింది అందుచేత..."

"పెట్టెలో చూడరా. ఏవో బట్టలుంటాయి" అన్నారు. నేను అక్కడనుంచి యింట్లోకివెళ్ళి పెట్టెలన్నీ వెతగ్గా వెతగ్గా- ఒక చిరిగిన లాగూ చొక్కా దొరికాయి అవి తీసుకు వెళ్ళి నాన్నగారికి చూపెట్టాను. నాన్నగారు దానికి చేయించవలసిన క్రియలు (అతుకులు) చేయించి నాకిచ్చారు. ఆబట్టలు వేసుకొని, నా సర్టిఫికేట్లు తీసుకొని విజయవాడ వెళ్ళాను.

క్రొత్త ప్రాంతమగుటచే, మొట్టమొదట నాకేమి చెయ్యాలో తెలియలేదు. ఎక్కడికి వెళ్ళాలో, ఏలా వెళ్ళాలో, అంతకన్నా తెలియదు. ఏంచెయ్యటంరా భగవంతుడా అని ఆలోచిస్తుండగా "రిక్షా కావాలా బాబూ" అంటూ రిక్షావాలా నా దగ్గరకొచ్చాడు. జేబులోని ఎడ్రసుతీసి వాడికి చదివిచెప్పి, 'తీసుకెడతావా! అన్నాను. వాడు రిక్షా ఎక్కించుకొని తీసుకువెడుతున్నాడు. ఏం ప్రశ్నలడుగుతారో, దానికేలా సమాధానం చెప్పి వారి ప్రాపకం సంపాదించుకోవాలో అని ఆలోచిస్తూండగా నాన్నగారిమాటలు నాహృదయాంతరాళంలో మారుమ్రోగాయి. దయకలిగేటట్లు ప్రవర్తించాలన్నమాటలు అతురాలా పాటిద్దామని ఒక నిశ్చయానికి వచ్చాను. రిక్షావాడు 'ఈ మేడే బాబూ' అన్నాడు. వాడిడబ్బుయిచ్చి లోపలికి వెడదామని బయలుదేరేను. అంతా సూట్లు, బూట్లు, హేట్లు, పెట్టుకొన్నవారే. నేనొక్కడినే దిష్టిబొమ్మలా, అతుకుల బొంతలు వేసుకొన్నవాడిలి. కొంత సిగ్గువేసింది. ఒకరి తరువాత ఒకరు ఆఫీసరుగారిదగ్గర కెడుతున్నారు. ఇంతలోనే నన్ను పిలిచారు.

తడబడుతూన్న అడుగులతో ఆఫీసరుగారి గదిలోకి ప్రవేశించాను. ఆయన నన్ను తదేకదీక్షగా, ఆపాదమస్తకం పరికించి, మాట్లాడకుండా బెల్ కొట్టారు.

"సార్......" అని ఏదో కష్టం చెప్పకుందామనుకున్నా. యింతలోనే బంట్రోతు మూగసంజ్ఞతో బయటికి వెళ్ళమన్నాడు. ఎందుకు నాతో మాట్లాడలేదా అని ఆలోచిస్తూండగా, లోపలనుంచి మాటలు వినిపించాయ్.

"బాబూ ఆ వచ్చిన కుఱ్ఱాడితో మాట్లాడలేదేం?"

"వాడికన్నా బిచ్చగాడు మెరుగు. మనకి యిటువంటివాళ్ళు పనికిరారు. చక్కటివేషం. యింపైన వాగ్ధాటి వుండి, జనబాహుళ్యాన్ని వల్లో వేసుకొనేశక్తి గల్గియుండాలికాని యిటువంటి బికార్లా మనకు కావలసింది"

"అంతేలెండి బాబూ, మనిషినిచూస్తేనే అసహ్యమేస్తోంది"

అన్న మాటలు వినిపించాయ్. నాకు కాళ్ళు చేతులు వణికాయ్. భూమి కదలిపోతూన్నట్లుంది. ఆ సమయంలో నాన్నగారిని తిట్టుకున్నా మంచి బట్టలు కట్టుకోవద్దన్నందుకు. బరువైన హృదయంతో నిరుద్యోగిననే నిరాశతో, అడుగులు లెక్కపెట్టుకుంటూ రైల్వేస్టేషను చేరుకున్నా. రైలు పొగలు క్రక్కుతూ, బయలుదేరడానికి సిద్ధంగావుంది. టికెట్టు కొనుక్కొని, కదోన్ని బండిలో చేరవేశా. రైలు విజయవాడ వదలిపెట్టేసింది. పచ్చటి పంటచేలల్లోంచి పైరుగాలి కిటికీగుండా వచ్చి కొంతబాధ నివారించినట్లయింది. గుడివాడస్టేషన్లో కాస్త కాఫీత్రాగుదామని దిగి బయలుదేరాను. ప్రిన్సిపాలుగారు ఆబండిలోనే వస్తున్నారు. వారిని చూడగానే నాకష్ట సుఖాలన్నీ వెళ్ళగక్కుకొని, స్కాలరుషిప్పు యిమ్మని వేడుకోందామనుకున్నా. కాని నాదుస్తులు చూసేసరికి నాకే అసహ్యమేసింది. ఈ బికారి బట్టలతో ఒక వుద్యోగం పోగొట్టుకొన్నాను. మళ్ళీ వీటితో వెడితే దీనికి కూడా నీళ్ళు వదులుకోవలసి వస్తుందేమోనని మాట్లాడకుండా ఆలోచిస్తున్నా.

"అంతెందుకండీ, వంద ఎకరాలున్న ఆ సామీలక్కూడా ఈ రోజుల్లో స్కాలరుషిప్పులే! వున్నవి అయిదుసీట్లు, వచ్చిన అప్లికేషన్లు అయిదువందలు. యిందులో మళ్లీ రికమెన్ డేషన్లు. అబ్బబ్బా చస్తున్నాము కొండి' అంటున్నారు ప్రిన్సిపాలుగారు.

"మీరు న్యాయదృష్టితో చూసి, బీద

# గొళ్ళెంలేని తలుపులు

(16-వ పేజీ తరువాయి)

కనిపించని నీడ మెల్లిగా జారుతూ, చప్పుడు కాకుండా, గడ్డివామి ప్రాకించి, కిందకి దిగింది. పెరటి తలుపు పైగొళ్ళెం ఊడింది. మెల్లగా తోస్తే కిర్రున చప్పుడయింది. గదిలో దూరి పావుగంట పరామర్శ చేసి, ఒక డబ్బా, మూటతో బయటికొచ్చింది. చంక నెత్తుకొని, నీడ యథాప్రకారం సాగిపొయ్యింది. తలుపుకమ్మలమించి, దిగిపోయింది. మళ్లీ కనిపించమన్నా కనిపించలేదు. తిన్నగా కూడెంలోకి, ఓ గుడిసెలోకి మాయమైంది నీడ.

నీడ పగలబడి నవ్వుతూ, "సచ్చిపొయ్యావనుకో! ఎక్కడ లేసిపోతారో అని భయం! సిన్నపుడు మా నాన్న సెపుతుండేవాడులే! అనుపానులన్నీ బాగా తెలుసును గనక ఈలయింది. నేకపోతే సిక్కిపోనూ?"

"మొత్తానికి గజదొంగ మర్రన్నగాడి కూతుర్ననిపించుకొన్నావన్నమాట-దొంగతనమైనా మీ బాబు కడుపు మాడినప్పుడే సేసేవోడట."

"డబ్బెంతుందో సెక్క సూడు – ఈ మూటలో గుడ్డలున్నట్టున్నై!"

నీడ తను కట్టుకున్న బట్టలు విప్పేసి, ఏదో కోక, రవికా సింగారించింది.

"దొంగ తాయారమ్మా!" అన్నాడు తలుపులు వికవిక నవ్వుతూ.

"ఛీ, ఛీ - సిగ్గు లేదు ముగోడివి!

సంచీ తిండానికే, తెచ్చేదేం లేదు గాని..."

తలుపులు జరజరలాడిస్తూ, జరీకండువా బయటికి తీశాడు మూటలోంచి.

*        *        *

తలుపులు ఏం ఎరగనట్టుగా, పొద్దుటే రెడ్డిగారింటికి వెళ్లాడు. అంతా లబో దిబో మంటున్నారు. రెడ్డి తలుపుల్ని పిలుస్తూ "అయ్యో ఎంత పనయిందో చూశావురా తలుపులూ! దొంగలు పడ్డార్రా"

తలుపులు నమ్మలేనట్టు విచారిస్తూ, "ఈ వూరోళ్లేనంటారా బాబా."

రెడ్డి నోరింత చేసుకొని, "ఏడిశారు! ఈ వూళ్లో యిదవలేం దొంగతనం చెయ్యగలర్రా! పై వూర్నుంచి దిగినోళ్లేరా."

తలుపులు బిత్తరపోయి చూస్తూ, "పోలీసోళ్ళకి రిపోర్టివ్వండి బాబా."

"ఏడిశావ్లే! ఆ దొంగవెధవ లెవరో నాకు తెలుసునులేరా నేనే రేపటికల్లా పట్టేసుకోను. ఈరాత్రి పూర్తిగా మేలుకొనేవుంటా. వొచ్చారంటే సచ్చారన్నమాట."

పోలీసులికి రిపోర్టిచ్చినా పని జరగదని చెపుతూ, "నీ పిచ్చిగాని, పాతికో పరకో అల్లు దొబ్బడవేంగాని, నాబం లేదురా" అన్నాడు.

తలుపులు అడుగుల్లో అడుగు లేసుకుంటూ సాగిపొయ్యాడు.

డబ్బాలో, వంద పైగావుంది. దాంతో ఓ గేదెనీ, రెండుచివుడు మేకల్నీ కొనేశాడు. మేక ఈనితే, గేదె పెయ్యదూడ పెడితే, మేకలమంద తయారవుద్ది, గేదె నమ్మితే రెండొందలుదాకా వస్తాది. దేవుడు దయసేసి, మంద మందలాగుండి, డబ్బు డబ్బులాగవస్తే, ఓ అరెకరం భూమి, గొనుక్కొని ఎగసాయం మొదలెడితే...

తనకీ తాయారమ్మకీ కాలిమీద కాలేసుకొన్నా జరిగిపోతాది.

ఆలోచనలతో, ఇంటిగడ పెక్కేసరికి, తాయారమ్మ పొయ్యిమీదికి కుండెక్కిస్తోంది.

ఇంటి ముంగిట ఏదో అరుపు వినిపించింది. ముందుకెళ్ళి చూసేసరికి పెద్దమేక నేలమీదపడి గిలగిల్లాడుతోంది. వాతం జబ్బు! అర్ధగంట తన్నుకు తన్నుకు కన్నుమూసింది తలుపులు ఎదరగుండా. తాయారమ్మ బయటికొచ్చి చూస్తూ, డబ్బంతా తగలెట్టి జబ్బుమేకలు కొన్నావేటి?" అంది.

"తెలిసింది కాదే! వొచ్చిం దొచ్చినట్టే పోయింది" అన్నాడు. కళ్లల్లోంచి కారుతోన్న కన్నీళ్ళు ఆపుకుంటూ.

వారంరోజులు గడిచాయో లేదో రెండో మేక కూడా దొమ్మవాతం వచ్చి చచ్చింది. తలుపులు లబో, దిబోమని మొత్తుకున్నాడు. "దొంగడబ్బు, దొంగడబ్బు నాగే పోతం దేవ్" అని కేకలేశాడు.

"సచ్చువాతం మేకలు కొనుక్కొచ్చి, తెగఖురుతావేటి?" అంది తాయారమ్మ.

మేక చచ్చిన మర్నాడు—

పోలీసువాళ్లు, ఇంకా ఇద్దరో ముగ్గురో మనుషులు వచ్చారు—

అందులో ఖంగమీసా లతను, తలుపుల్ని పోలీసులికి చూపుతూ "ఇతనేనండి" అని చూపెట్టాడు. అందులో రెడ్డి తమ్ముడు "ఏం పన్లురా యియ్యి" అని కేకేశాడు.

తలుపులికి ముచ్చెమటలూ పోశాయి. తనూ పెళ్ళాం చేసిన దొంగతనం తెలిసిపోయింది. తను దొంగ! దొంగయిపోయాడు. నలుగురు నోళ్ళల్లో జావనానినట్టు నానిపోతాడు. మొహంమీద వుమ్మేసి, పెళ్లాన్నీ తననీ చావమోదుతారు. ఛీఛీ లేసి, ఛీడీలు! ...వెధవ నెంజ! దొంగనెంజ వద్దన్నా వెళ్లి వాళ్ళింట్లో డబ్బు దొబ్బుకొచ్చింది. దాని మూలాన...దాని మూలాన...తనకి అప్రతిష్ఠ! ఇలాంటోళ్ళుంటే ... దాని రక్తం తాగితే దోసెళ్ళకొద్దీ... గజదొంగ కూతురు ... దాన్నెందుకు పెళ్లిచేసుకున్నాడు?

"నేనేం సెయ్యనేదు బాబయా అంతా అదేనండి"—తలుపులు బిక్కమొహం వేసి, అన్నాడు. పోలీసుల్లో పొడుగుపాటతను గద్దిస్తూ, "నోర్ముయ్! ఈ గేదెక్కడిది? ఎక్కడ కొన్నావ్?"

"నాదేనండి బాబూ! సొంత డబ్బెట్టి కొన్నానండి పంతలో..."

"ఇది దొంగ గేదె తెలుసా?"

"నాది దొంగడబ్బు కాదండి కష్టార్జితం. నేనూ, నా పెళ్ళాం కట్టుబడి రేతిరింబగళ్లు సెమటోడ్చి, కొన్నాం బాబయా!"

వచ్చిన పెద్ద మనుషులు నోళ్లు బాగా తెరిచి, వికావిక నవ్వుతూ, "ఈ గేదె దొంగది. ఎవరో దొంగతనం చేసి తెస్తే నువ్వు కొన్నావన్నమాట. ఇప్పుడు తోలుకుపోతారు. అడ్డం పెట్టావో జైల్లోకి తోస్తారు" అన్నారు.

"నా డబ్బో బాబయ్యో"

"కష్టార్జిత మంటున్నావుగా. ఏటిలో పారేసినా, ఏటి కెదురీది వస్తుంది. భయపడకు"—

తలుపులు తన కళ్లెదురుగ్గానే, తోలుకు

---

వారికి మాత్రమే యివ్వండి" అన్నారు ప్రక్కాయన.

"నా వుద్దేశ్యం కూడా అదే. మొన్నొకు రాడు సిల్కుబట్టలు వేసుకొని ప్రాపర్టీ సర్టిఫికేటుతో నాదగ్గర కొచ్చాడు. వాడిని చూస్తే డబ్బు గలవాడిలా వున్నాడు. వాడి పేరు...రామారావు కాబోలు. వాడు వెళ్లగానే ఆ అప్లికేషను చిత్తుకాగితాలబుట్టలో వేశా. చూశారా..." అన్న మాటలు వినిపించాయ్. రెండు కార్యాలు ఈవిధంగా వేషంవల్ల దగ్ధమై పోయినందుకు చాలా బాధపడ్డాను. దేహాన్ని యింటికి చేరవేశాను.

జ్వరంతో వళ్ళు సలసలా కాగిపోతూంది. ఆ జ్వరంలో ఒళ్లు తెలియకుండా "వేషంవల్ల వచ్చిన దోషం" అని కలవరించానట. ఆ మాటలు అర్థంగాక అమ్మ, నాన్న మొహాలు చూసుకున్నారు. ★

# ★ మార్కులవేట ★

(37–వ పేజీ తరువాయి)

న్నారు.' అన్నారు మాష్టరుగారు.

"ఆ...ఆ" అంటూ అప్రయత్నం ఏమీ చెయ్యడం లేదు.

హెడ్ మాష్టరు గారి పని మహా విషమంలో పడ్డది. అవతల స్కూలుకు టైమ్ అవుతోంది. ఇవతల ఈ బ్రాహ్మడు అపుపోసన పట్టడు. ఆయన అపుపోసన పట్టకుండా తను అపుపోసన పట్టకూడదు. సంగతేమిటో తెలీటల్లేదు—

'కానివ్వండి. ఏమైనా కావాలంటే అడగండి' అన్నారు మాష్టరుగారు, క్రొత్త ఆవకాయి లాంటిది ఏమైనా కావాలేమోనని.

ఇంక బిగిస్తే అసలు సంగతి విప్పడు. విస్తుందేమోనని 'మీరు నాకొక సహాయం చేయాలి చేస్తానంటే చెప్తాను' అని చల్లగా అన్నాడు అవధాన్లు.

'అదేమిటో చెప్పండి వీలైతే చేస్తాను' అన్నారు మాష్టరుగారు.

'మీరు చేస్తానని మాట యివ్వండి. మీ చేతిలో వున్న పనే.

అపుపోసన పడతాను'

'సరే సంగతేమిటో చెప్పం'డన్నారు మాష్టరుగారు.

ఇంక చల్లగా మొదలెట్టాడు అవధాన్లుగారు తన కొడుకు పరీక్షకు కూర్చున్నట్లు, లెక్కల్లో మార్కులు చెయ్యకపోతే పాస్ అవనట్లు కాన వెయ్యవలసిందనీ. ఈపని తప్పక చెయ్యవలసినదనీ లేకపోతే విస్తరిముందునుంచి లేచిపోతాననీ – హెడ్ మాష్టరు గారి మనస్తత్వం మీద దెబ్బకొట్టాడు.

హెడ్ మాష్టరుగారు నిశ్చేష్టుడయ్యాడు. ఇల్లాంటి పని తన యిన్నేళ్ల సర్వీసులో ఎప్పుడూ చెయ్యలేదు. చివరకు డి. యి. ఒ. గారొచ్చినా వీల్లేదని పంపేశాడు. కాని యిప్పుడీ బ్రాహ్మడు అపుపోసన పట్టకుండా కూర్చున్నాడు. ఆలోచించి చివరకు 'సరే' ననక తప్పలేదు.

అప్పటికీ అవధాన్లుగారికి అనుమానంగానే వుంది మార్కులు వేస్తాడో వెయ్యడోనని. ఈ అనకాశం జారిపడుతే మళ్ళీ భోజనానికి వుంటాననా్న వద్దంటాడు. యింక ఏవిధంగాను పనిసాధించ లేడు తను.

"మీరు సరే"నంటే గాదు; తమరు నాయెదట మార్కులు వేస్తేనె నాకు సంతృప్తి" అని బిగిసి కూర్చున్నాడు అవధాన్లు.

'వేస్తాను మీరు అపుపోసన పట్టండి' అని హెడ్మాష్టరు.

'అయ్యా' తమరలా అంటే గాదు. నా ఆదుర్దా మీకేం తెలుస్తుంది చెప్పండి. ఇంకా మీరు అపుపోసన పట్టలేదు కాబట్టి పేపరు తీసుకువచ్చి మార్కులు వేసెయండి. మీకు తృప్తితీరా భోజనం చేస్తాను' అన్నారు అవధాన్లుగారు.

ఇంక మాష్టరుగారికి తప్పలేదు. వెళ్లి పేపరు తీసుకువచ్చి పాస్ మార్కులు వేసేశారు పేపరేమీ దిద్దకుండానే. 'ఇంక కానివ్వండి' అన్నారు మాష్టరుగారు. 'నెయ్యి పట్టుకురామ్మా' అంటూనే పుప్రక్రమించాడు అవధాన్లు భోజనానికి. ★

## "చైతన్యం"

(25 వ పేజీ తరువాయి)

"...సంహారం చేయిం మనో." ... కుప్పకూలిపోయాయి... ...చా ఫు రు ... తెల్లవారి ... వరకూ అతను తిరగనేకపోయాడు. ... మూడు ... ఫీజు, ఇంటో మూకు ముందు... మిగిలిన పని..... శరీరంమీద జీవితాంతం కాల్చిన ..., ... నివ్వడానికి......నిల్చున్నాయి.. ... జీవితం, ... అనుకునే ... 

ఇప్పటివరకూ ... చూస్తే ... లేదు... ... ప్రకవాయిం ... లేదు.

... "... ముందిగా ...?" అని ... కళ్లలోకి చూసి ... కొడ్చేవాడు... ★



## గోళ్లెంలేని తలుపులు

పోతోంది, నీరసంగా నిలబడి పోయిన దిక్కు చూస్తూ గుటకలు మింగుతున్నాడు. వచ్చిన నేది వచ్చినట్టే వెళ్ళిపోయింది. తాయారమ్మ బయటికి వొచ్చి చూస్తూ, "అయిపోనాదా?" అంది—

"అయిపోనాది. కట్టాలిత మైతే ఏటికెదురీద వత్తాది" అన్నాడు—

కళ్ళల్లోంచి నీటిబిందువు వెచ్చగా మరిగి, మలినమైన అతని చేతిమీద రాలింది— ★

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu ChettySt, Madras



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త...విశ్వాత్ముల నరసింహమూర్తి






































అమ్మకమునకు సిద్ధముగా నున్నది!!

# రెండు మహా నగరాలు

చార్లెస్ డికెన్స్



'అది ఒక వైభవోజ్జ్వల మహాయుగం— వల్లకాటి అధ్వాన్నశకం; వెల్లవిరిసిన విజ్ఞానం—బ్రహ్మ జెముడులా అజ్ఞానం; ఆశాకుసుమాలు పుష్పించిన ఆమధుర వసంతం— నైరాశ్యపు చలి గుబుళ్లు యీచుకున్న శిశిరాస్యం; సర్వసంపత్సమృద్ధి— సర్వతోముఖ క్షామం; సూక్ష్మంగా చెప్పాలంటే—నేటి పరిస్థితికి నకలుగా వుంది నాటి పరిస్థితి.

అలాంటి కల్లోలదినాలలో లండన్ పారిస్ నగరాలను రెంటినీ పెనవేసుకుని సాగిన ప్రణయబలిదాన గాథ! ఆంగ్ల నవలా ప్రపంచ నిర్మాత చార్లెస్ డికెన్సు ప్రతిభా సంపత్తుయి వెల్లివిరిసిపోయిన 'టేల్ ఆఫ్ టూసిటీస్' అనే 'క్లాసికల్' నవలకు అనువాదం.

అనువాదకులు:

శ్రీ తెన్నేటి సూరి

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో సీరియల్ గా వెలువడిన ఈ రచనను యిప్పుడు గ్రంథరూపంలో అందజేస్తున్నాం.

వెల: రూ. 3-0-0 లు పోస్టుఖర్చులు ప్రత్యేకం.

ఆంధ్ర గ్రంథమాల. మద్రాసు-1.